ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సమగ్ర సాహిత్య, సామాజిక పత్రిక

మమత-సమత-మానవత
www.gurajada.org

సంపుటి 2 | సంచిక 5 అక్టోబర్ - డిసెంబర్ 2022




## వాగ్గేయకార సాహిత్య శోభ

ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

## సమగ్ర సాహిత్య, సామాజిక పత్రిక

మమత-సమత-మానవత
www.gurajada.org

























## మనవి

ప్రక్కన చూపిన ప్రకటన 1940 లో భారతి పత్రికలో పత్రిక యాజమాన్యం ఇచ్చిన ప్రకటన. 2021 లో, ప్రకాశిక పత్రిక కూడా ఈ ప్రకటనలో ఆశించిన స్వభావం గల రచనలను ఆహ్వానిస్తోంది. కాలం మారింది, సమస్యల స్వరూపం మారింది. కానీ, సమాజ శ్రేయస్సుకి ఉపయోగపడే సాహిత్య అవసరం మాత్రం ఇంకా ఉంది. చాలా ఉంది. మీలో ఉన్న గురజాడ తత్వాన్ని, చైతన్యాన్ని తట్టి లేపండి. మంచి రచనలు మాకు పంపండి.



సంపుటము. ౧౭ భారతి, చైత్రమాసము (ఏప్రిల్ 1940) సంఖ్య. ౪

వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకపక్కే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. కావ్యవ్యాసాలు పదిహన్నెండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటింపవలసివచ్చును. "బాలానందమున" కుచితమైన కథలు, పాటలు, సాధ్యమైనంతవరకు పిల్లలభాషలో రచించి పంపించవలసినదని కవులకు మనవి. విమర్శలకు గ్రంథములు పంపువారు రెండుప్రతులు పంపవలెను.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను కొత్తదనం కావాలి. మన ఉద్యమాలు, మనదేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసినదని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.

Connect with us On Facebook : https://www.facebook.com/Prakasika1
Join us Via Telegram Prakasika telegram link : https://t.me/joinchat/SIYqileFRFSJ_zi_
Contact us: editor@prakasika.org

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యూటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి ''మనస్వినీయం'' అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి, మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు

ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.



## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు

గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళ డంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ- పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కా రం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన

సాఫల్య పురస్కా రం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కా రం, తె.వి.వి.కీర్తి పురస్కా రం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కా రాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మిం చారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆ ఫ్ డిస్టెన్స్ ఎడ్యుకే షన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిం చారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్పైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.



## డా.సి. భవానీదేవి

సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శి గా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్టాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభరావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్. డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కా రం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 - 10 మధ్య తిరుమల తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.



## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు

దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్ఫైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు.అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.

# ముఖచిత్రం

## వాగ్గేయకార సాహిత్య శోభ




# లోపల



## ప్రత్యేక వ్యాసాలు

# ధన్యోస్మి



ప్రకాశిక అక్టోబర్ – డిసెంబర్ 2022 సంచిక ''వాగ్గేయకార సాహిత్య శోభ'' అనే అంశం మీద ఒక ప్రత్యేక సంచికగా మీ ముందుకు వస్తోంది. పాత కొత్తల మేలు కలయికగా సంతరించుకుంటున్న ప్రకాశికని ఆదరిస్తున్న అశేష తెలుగు భాషాభిమానులకీ, సాహితీవేత్తలకీ కైమోడ్పులు.

అతిథి సంపాదకులుగా సమర్ధవంతంగా ఈ సంచికని తీర్చిదిద్దిన ఆచార్య జి. ఎస్. మోహన్ గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. పలువురు సాహిత్యవేత్తలతో ప్రామాణికమైన పరిశోధనాత్మక వ్యాసాలు ప్రకాశిక కోసం ప్రత్యేకంగా రాయించి ప్రకాశిక పత్రిక ప్రమాణాలు మరింత ఇనుమడించేలా చేసిన ఆచార్య జి. ఎస్. మోహన్ గారికి ప్రకాశిక సంపాదక వర్గం అభినందనపూర్వక కృతజ్ఞతలు తెలుపుతోంది.

ఈ ప్రత్యేక సంచికలో ప్రచురణ కోసం మంచి వ్యాసాలు ప్రత్యేకంగా రాసి పంపిన వ్యాసకర్తలకి శతకోటి నమస్సులు.

ఈ సంచిక వెలువరించడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సహకరించిన వారందరో, వారందరికీ వందనములు.

గత సంవత్సరం లో వచ్చిన సంచికలకోసం ప్రత్యేకంగా వ్యాసాలు రాసిన వ్యాసకర్తలందరికీ మరొక్క సారి కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

భవదీయుడు
ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు








**ఆచార్య జి. ఎస్. మోహన్**
అతిథి సంపాదకులు
"వాగ్గేయకార సాహిత్య శోభ"

ఆచార్య జి. ఎస్. మోహన్ గారు తెలుగు-కన్నడ భాష రచయిత, అనువాదకుడు. ఆయనకి కేంద్ర సాహిత్య అకాడమీ నుంచి అనువాద పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం నుంచి సాహితీ పురస్కారం, గ్రహించారు. అవే గాకు పలు ప్రతిష్ఠాత్మక పురస్కారాలు కూడా గ్రహించారు. బెంగళూరు విశ్వవిద్యాలయం లోని తెలుగు విభాగంలో 37 సంవత్సరాలు ఆచార్యులుగా పనిచేసారు. ఆయన తెలుగు జానపద సాహిత్యం మీద విశేష కృషి చేసారు. ఆచార్య మోహన్ గారు 70 గ్రంథాలతో పాటు 300 కు పైగా వివిధ అంశాలపై తెలుగు, కన్నడ, ఆంగ్లం లో వ్యాశాలు పలు పత్రికలలో ప్రచురించారు. డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు వీరికి మాతామహులు.

## సంపాదక దృక్కోణం

# వాగ్గేయకారుల సాహిత్య సేవ



ఆచార్య జి. ఎస్. మోహన్
✆ 94484 05110

తెలుగు సాహిత్య క్షేత్రంలో 'వాగ్గేయకార సాహిత్యా'నికి విశిష్టస్థానం ఉంది.

**'సంగీతమపి సాహిత్యమ్ సరస్వత్యాః స్తనద్వయమ్|**
**ఏకమాపాత మధురమ్ అన్యదాలోచనామృతమ్||'**

సంగీత సాహిత్యాలను రెండింటినీ ఆస్వాదించిన కవులు సంకీర్తనకవులు; వాగ్గేయకారులు. పదకవినే వాగ్గేయకారుడని అంటున్నాము. వాగ్గేయకారుడంటే వాక్యాన్ని గేయరూపంలో పెట్టేవాడు. అంటే వాక్కును గేయాన్ని (వాక్ + గేయం) కూర్చే నేర్పు కలవాడు వాగ్గేయకారుడు. లాక్షణికులు పదంలోని సాహిత్యాంశాన్ని 'వాక్' అని, సంగీతాంశాన్ని 'గేయ'మని వ్యవహరించారు.



పాటలోని వాక్కులకు 'మాతువు' అనిపేరు. సంగీతానికి సంబంధించిన గేయానికి 'ధాతువు' అనిపేరు. వాగ్గేయకారుడికి ఉండాల్సింది వాక్శక్తి మరియు గేయ నిర్మాణ చాతుర్యం. అలాగే సుశబ్ద, అపశబ్దాలకు సంబంధించిన శబ్దానుశాసన జ్ఞానం మరియు ప్రయోగ కౌశలం ఉండాలి. నవరసాలు, వాటి స్థాయీ భావాలు, విభావానుభవ సంచారీ భావాలను కూడా వాగ్గేయకారుడు తెలిసికొని ఉండాలి. దేశిరాగాలకు

సంబంధించిన జ్ఞానం ఉండాలి. ఈ లక్షణాలనన్నింటిని శార్ఙదేవుడు (13వ శతాబ్దం) తన 'సంగీత రత్నాకరం'లో పేర్కొన్నాడు.

**'వాజ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభి ధీయతే,**
**వాచం గేయంచ కురుతేయ స్సవాగ్గేయకారః'**

ఇది వాగ్గేయకారునికి 'సంగీతరత్నాకరం'లో ఇచ్చిన నిర్వచనం.



కీర్తన యొక్క 'మాతువు' దేవతాస్తుతి పరమై ఉంటుంది. పల్లవి, అనుపల్లవి మరియు చరణాలతో కూడుకొని యుంటుంది. మొదటి చరణం చివరిభాగం అనుపల్లవి యొక్క ధాతువును అనుసరిస్తుంది. మరిరెండు చరణాలు మొదటి చరణం ధాతువును అనుసరిస్తాయి.

పదానికి (పాటకు) పల్లవి ప్రాణం లాంటిది. పల్లవిలో సూచించిన వస్తువును చరణాలలో విస్తృతపరచడానికి ఉపయోగపడేది అనుపల్లవి. సాధారణంగా పదానికి మూడు చరణాలుంటాయి. పల్లవి, అనుపల్లవి, చరణాలు – ఇది పదనిర్మాణం.

'పదం' అనే పారిభాషిక శబ్దం నాట్య శాస్త్రంలో చెప్పబడింది. అక్షర సహితమూ, అక్షర యుతమూ అయినది పదం. పదాల్లో ఆధ్యాత్మ మరియు శృంగారం అనే రెండు రీతుల్ని వస్తు దృష్టితో గుర్తించవచ్చు. అన్నమయ్య తన 'సంకీర్తన లక్షణం'లో సంకీర్తనని పదమని పిలిచి శృంగారం మరియు వైరాగ్య పదాలన్న విభజన చేశాడు. వైరాగ్యపదం 'అగ్రామ్యరమ్య విష్ణుచరితో దారం' అయి ఉండాలి. అంటే అన్నమయ్య చెప్పినట్టుగా వైరాగ్యపదాలు అగ్రామ్యాలు గాను, రమ్యంగానూ విష్ణు సంకీర్తనలు గాను ఉండాలి. ఆ తర్వాతికాలంలో వైరాగ్యపదం లేదా 'దేవరనామాల'కు కీర్తనలనీ, శృంగార ప్రధానరచనలకు

పదాలన్న పేరు వచ్చింది. తెలుగులో క్షేత్రయ్య శృంగార రచనలకు 'పదం' అనేది పారిభాషిక పదం అయింది. అన్నమయ్యకు 'పదకవితా పితామహుడ'న్న బిరుదం ఉన్నా ఆయన రచనలకు కీర్తన లేదా సంకీర్తన అనేదే రూఢి అయింది అంటారు కన్నడ పరిశోధకులు డా. అక్కమహాదేవి గారు. ('పురందరదాసర మత్తు అన్నమాచార్య కీర్తనగళ సాంస్కృతిక అధ్యయన', పుట 7)

బ్రహ్మానందమైన అనుభవానికి రసరాగలయబద్ధమైన నాదోపాసనకోసం వాగ్గేయకారులు కనిపెట్టిన పరమోత్త సాధనాలలో 'కీర్తన' ఒకటి. కీర్తన అంటే స్తుతి, వర్ణన అని అర్థం. నవవిధ భక్తుల్లో కీర్తన కూడా ఒకటి. భగవంతుని కీర్తిస్తూ, చేసే గానమే కీర్తనభక్తి. అందువల్లనే కన్నడంలో కీర్తనను 'దేవరనామ' అని కూడా అంటారు.

"సంగీత రచనా ప్రధానములగు త్యాగయ్య గారి రచనలవంటి వానిని 'కృతు'లనుచున్నాము. భక్తి ప్రధానములగు రామదాసు పాటలవంటివి 'కీర్తనములు' అనుచున్నాము....." అంటారు ప్రసిద్ధ పరిశోధకులు శ్రీమాన్ రాళ్ళపలి అనంతకృష్ణశర్మ గారు.

కీర్తనలలో నామముద్ర ఉండటం లక్షణంగా కనిపిస్తుంది. ఎవరికి అంకితంగా పదం రచింపబడుతుందో, అతని పేరును ఆపదంలో స్మరించడాన్ని, అతని నామాంకితంగా పదరచనచేయడాన్ని నామముద్ర లేదా పదముద్ర అంటారు. తాళ్ళపాక కవుల రచనలు శ్రీ వేంకటేశ్వరుడి నామాంకితాలు. క్షేత్రయ్య పదాలు మువ్వగోపాల నామాంకితాలు. సారంగపాణివి వేణుగోపాల నామాంకితాలు అవుతే, త్యాగయ్యవి శ్రీరామాంకిత పదాలు. యాగంటివారు, వీరబ్రహ్మం, దూదేకుల సిద్ధయ్య మొదలైన పదకవులు ఆత్మ ముద్రాంకితంగా కూడా రచనలు చేశారు.

పదకర్తలు లేదా వాగ్గేయకారులు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. తెలుగు సాహిత్య చరిత్రలో పదకవితలకు, వాగ్గేయకారులకు విశిష్టస్థానం ఉందని నిరూపిస్తుంది ఈ ప్రత్యేక సంచిక.

ఈ సంచికలోని రచయితలందరూ తమ తమ సాహిత్యరంగాలలో లబ్ధ

ప్రతిష్ఠులు. ఇందులో పదకొండు వ్యాసాలు వాగ్గేయకార సాహిత్యానికి సంబంధించినవి. డా. గుమ్మా సాంబశివరావు గారు 'తెలుగు సాహిత్యంలో పదకవితావికాసం' గురించి క్షుణ్ణంగా పరిశీలించారు. ఆచార్య పి.ఆర్. హరినాథ్ గారు తాళ్ళపాక పదసాహిత్యం గురించి వివరించారు. ఆచార్య ఎస్. గంగప్ప గారు సారంగపాణి పద సాహిత్య సౌరభాన్ని, ఆచార్య వెలమల సిమ్మన్న గారు క్షేత్రయ్య పదసాహిత్య వైభవాన్ని, ఆచార్య జి. దామోదర నాయుడు గారు చిన తిరుమలాచార్యుల సంకీర్తనల స్వరూపాన్ని వివరించారు.



తెలుగు వాగ్గేయకారులు సంగీతానికి చేసిన సేవను డా. చల్లా ప్రభావతి గారు, త్యాగయ్యగారి పంచరత్నకీర్తనలు గురించి డా. పరమేశ్వరయ్య గారు ప్రత్యేకంగా వ్యాసాలు వ్రాసి పంపించారు. అన్నమాచార్యుల కీర్తనల మీద నాలుగు వ్యాసాలు ఉన్నాయి. అన్నమయ్య కీర్తనలలో సాంఘిక దృక్పథం అన్న వ్యాసాన్ని ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు గారు, అన్నమయ్య భావుకత గురించి ఆచార్య ఎం. రామనాథం నాయుడుగారు, అన్నమయ్య కీర్తనలలో ఆచారవ్యవహారాల గురించి ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డిగారు తమ అమూల్యమైన వ్యాసాలను వ్రాసి పంపించారు. సహకరించిన రచయితలందరికీ ప్రధాన సంపాదకులు, ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ గారి తరపున, నా తరపున ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

నామీద ఉన్న అభిమానంతో, విశ్వాసంతో ప్రకాశిక పత్రిక లో "వాగ్గేయకార సాహిత్య శోభ" అనే ప్రత్యేక సంచికకి అతిథి సంపాదకత్వం వహించే అవకాశం ఇచ్చిన ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ గారికి కృతజ్ఞతలు, ధన్యవాదాలతో పాటు నమస్సుమాంజలులు.

# సద్గురు శ్రీ త్యాగరాజు స్వామి వారి ఘన రాగ పంచరత్న కృతుల అనుశీలనము



**డా.యడవల్లి పరమేశ్వరయ్య**
✆ 94402 54285

మనసునకు ఏకాగ్రతను కల్పించమని శ్రీ సద్గురు త్యాగరాజ స్వామి వారికి సభక్తికంగా ఉత్పలమాల సమర్పించి ఈ ప్రయత్నాన్ని ప్రారంభిస్తున్నాను.

**తారక రామ మంత్రమున తన్మయమందుశివాంశమై మహిన్**
**నారద మౌనిమార్గమున నాదముపాసన జేసిరాజిలన్**
**వారిజ నేత్రుడై కరుణ వారిధియౌ సతి జానకీశుపైన్**
**ధారలుగా కృతుల్ సలుప ధారుణి మెచ్చెను త్యాగరాజునిన్.**

19వ శతాబ్దంలో శాస్త్రీయ సంగీతానికి ప్రాణం పోసిన ప్రధాన వాగ్గేయకారులు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు, శ్రీ త్యాగరాజు, శ్రీ శ్యామశాస్త్రుల వారు. ఈ ముగ్గురు దక్షిణ భారత సంగీత త్రిమూర్తులుగా ప్రసిద్ధి పొందారు. ముత్తుస్వామి దీక్షితులవారు, క్షేత్ర పర్యటన చేసి ఆయా క్షేత్రాలలో వెలసిన దేవతామూర్తులను కీర్తిస్తూ 'గురుగుహ' ముద్రతో రచనలు చేశారు. శ్యామశాస్త్రుల వారు 'శ్యామ కృష్ణ సోదరి' అనే ముద్రతో అమ్మవారిని కీర్తిస్తూ రచనలు చేశారు. త్యాగరాజుస్వామి వారు ప్రధానంగా రామచంద్రుని కీర్తిస్తూ "త్యాగరాజనుత" (త్యాగరాజు చేత నుతింపబడేవాడు) అనే ముద్రతో కృతులను, ఉత్సవ సంప్రదాయ మరియు దివ్యనామ సంకీర్తనలను రచించారు. ప్రహ్లాద భక్తి విజయము, నౌకా చరితము మొదలైన గేయ నాటకాలు కూడా రచించారు.

త్యాగరాజస్వామి వారు తన క్షేత్ర పర్యటనలో భాగంగా కొవ్వూరులో వెలసిన శ్రీ సుందరేశ్వర స్వామిని కీర్తిస్తూ ఐదు పంచరత్న కృతులు గానం చేశారు. వీటికి కొవ్వూరు పంచరత్నాలు అని పేరు. తిరువత్తియూరులో వెలసిన శ్రీ త్రిపుర సుందరీ దేవిని కీర్తిస్తూ ఐదుపంచరత్నాలు గానం చేశారు. వీటికి తిరువత్తియూరు పంచరత్న కీర్తనలు అనే పేరు. పరమాత్మ జీవాత్మ తత్త్వాన్ని ప్రబోధిస్తూ ఐదు ఘనరాగాలలో ఆది తాళంలో ఐదు పంచరత్నాలు గానం చేశారు. ఇవి బహుళ ప్రాచుర్యాన్ని పొందాయి.

## పంచరత్నాలలోని పరమార్థం:-

పంచరత్న కృతులు వరుసగా

**1. జగదానందకారక జయ జానకీ ప్రాణ నాయక**

**2. దుడుకు గల నన్నే దొర కొడుకు బ్రోచురా**

**3. సాధించెనే ఓ మనసా**

**4. కనకన రుచిరా కనకవసన నిన్ను**

**5. ఎందరో మహానుభావులు అందరికీ వందనములు**

మొదటి కృతిలో పరమాత్మ తత్వం వర్ణించబడింది. రెండు, మూడు, నాలుగు, ఐదు కృతులలో జీవాత్మ గురించి చెప్పబడింది.

వజ్ర వైడూర్యాది తొమ్మిది రత్నాలకు నవరత్నాలు అని పేరు. కానీ త్యాగరాజస్వామి వారు రచించిన ఐదు కృతులకు పంచ రత్నాలు అని పేరు. పంచశబ్దం రత్నాలకు అన్వయించడం విశేషం. ఆ విషయం ఏంటో తెలుసుకుందాం.

## సద్యోజాతాది పంచముఖాలు నుండి వెలువడినవి పంచరత్నాలు :

నాదమే శరీరంగా కలిగిన ("నాదాతనుమనిశం...") శివుని సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన ఐదు ముఖముల నుండి స రి గ మ ప ద ని ("సద్యోజాతాది పంచవక్త్రజ సరిగమపదని స్వర సప్తస్వర") అనే సప్తస్వరాలు పుట్టాయి. రామనామం యొక్క ప్రభావం లేదా గొప్పదనం తెలిసినవాడు శివుడు ("వరరామ నామమనే కండ చక్కెర మిశ్రము జేసి భుజించు శంకరునికి తెలుసును"). "రామ నామమను వర ఖడ్గము చేత బట్టి" "బంటు రీతి కొలువు"

చేస్తూ, "శోభిల్లు సప్తస్వర సుందరుల" కీర్తిస్తూ "రామ భక్తి సామ్రాజ్యము" స్థాపించిన వాడు త్యాగరాజు. త్యాగరాజ నామ సార్థకతకు నిదర్శనంగా శివాంశతో జన్మించిన మహాపురుషునిగా త్యాగరాజును భావించగలిగితే పంచరత్న శబ్దం బోధపడుతుంది.

శివుని ఐదు ముఖములకు ప్రతీకగా పంచ శబ్దం మరియు మణి, స్వజాతి యందు శ్రేష్టమైనది, ప్రకాశించే గుణం కలది, ఆకర్షణ శక్తి గలది అనే అర్థాల్ని యిచ్చేరత్నశబ్దార్థాలన్నీకలిసిపంచరత్నాలుఅయినట్లు(శివునిపంచముఖాలలో ప్రకాశించేవి) అన్వయించుకోవచ్చు.

## ఆదితాళము (చతురస్ర గతి) ఎంచుకోవడంలో విశేషం :

వాల్మీకి మహర్షి ముప్పై రెండు అక్షరాలు కలిగిన

అనుష్టుప్ ఛందస్సులో సంస్కృతంలో శ్రీ మద్రామాయణాన్ని రచించాడు. శ్రీరాముని కీర్తించే ఈ పంచరత్నాలు 32 అక్షరాలు కాల ప్రమాణం కలిగిన ఆదితాళంలోగానంచేయడంఔచిత్యంగాను,మరియుభగవంతుడుఆద్యుడు, ఆదిమూర్తి, ఆదిదేవుడు అనే అర్థానికి నిదర్శనంగాను, సామజ వర గమనుని నడకల హొయలు ఇలా ఉంటాయని చూపించడానికి గాను ఆది తాళాన్ని ఎంచుకున్నట్లు గుర్తించాలి.

## ఘనరాగములను ఎంచుకోవడంలో విశేషం :

ఘన రాగము అంటే పరమ ప్రేమ అని అర్థం. ప్రాణుల యందు పరమ ప్రేమ కలిగిన వాడు, ఘనుడు, గొప్పవాడు శాశ్వతుడు అయిన భగవంతునికి దృష్టాంతంగా ఘన రాగములు లేదా గాన పంచక రాగములను ఎంచుకున్నట్లు తెలుస్తుంది. మరొక కారణంగా ఘనరాగము అంటే గొప్ప రాగము ప్రసిద్ధి పొందిన రాగం అనే అర్థంలో ఈ ఐదు రాగార్థాలను అన్వయించి చూడగా నాట (నటన) నటన సూత్రధారి అయిన పరమాత్మ లీలలు వర్ణించింది, గౌళ (కఠినమైనది) దుడుకుగల కఠిన మనస్కుడైన బ్రాహ్మణుని గురించి చెప్పింది, ఆరభి (ప్రారంభం) మంచితనం మొలకెత్తిన బ్రాహ్మణుడు పరమార్థాన్ని గ్రహించినట్లు వర్ణించింది, వరాళి (కన్నీరు కార్చడం) పరమాత్మను దర్శించిన బ్రాహ్మణుడు పరవశంతో ఆనంద భాష్పాలు రాల్చినట్లు వర్ణించింది. శ్రీ

(గౌరవింప దగినది) బ్రాహ్మణుడు ఎందరో మహానుభావులకు (భాగవోత్తో త్తములకు) గౌరవంతో నమస్కరించి నట్లు వర్ణించింది. ఇంత పరమార్థం కలిగిన విశేషమైన కారణాల చేత ఈ కృతులు "ఘన రాగ పంచరత్న కృతులు"గా పేరు సార్థకతను సాధించి, బహుళ ప్రాచుర్యాన్ని పొందాయి.

## పంచరత్న కృతులలోని విశేషాలు :

త్యాగరాజ స్వామి రచించిన అన్ని కృతుల సారాంశం ఈ పంచ రత్న కృతుల్లో కనిపిస్తుంది. త్యాగరాజ స్వామి తన స్వీయచరిత్రను చిత్రీకరించినట్లు బోధపడుతుంది. పరమాత్మ నుండి వేరుపడిన జీవాత్మ ఎన్నో జన్మల అధిక పుణ్య పరిణామంగా (పాపం కంటే పుణ్యం అధికంగా) అత్యున్నతమైన మానవజన్మ లభిస్తుంది. మిగిలి ఉన్న కొంత పాపమనే మఱకను మానవ జన్మలో పోగొట్టుకోవాలి. తాను ఎక్కడ నుండి వచ్చాడో ఆ స్థాయిని అందుకోవాలి. అద్వైత భావం అర్థం చేసుకుని పరమాత్మ నుండి వచ్చిన తాను మళ్ళీ పరమాత్మలో ఐక్యం కావడానికి ప్రయత్నించాలి. మానవ జీవిత పరమార్థాన్ని సాధించాలి. వేదాధ్యయనం ద్వారా ఈ విశేషాంశాన్ని తెలుసుకున్న ఒక బ్రాహ్మణుడు (త్యాగయ్య) కలియుగంలో కీర్తన భక్తి ద్వారానే ఇది సాధ్యం అవుతుందని భావించాడు. గొప్ప వాగ్గేయకారుడుగా కావాలని అనుకున్నాడు.



విజయ పరంపరలు చరిత్రగా గలిగి జీవుల ప్రాణ నాయకుడై జగదానందకారక అన్న బిరుదు పొందిన పరమాత్మ తత్వాన్ని మహత్వాన్ని వేదాధ్యయనం ద్వారా తెలుసుకున్న ఆ బ్రాహ్మణుడు ("జగదానందకారక....") మానవ జీవిత పరమార్థాన్ని తెలిసినవాడు కాబట్టి కొంత సంగీత జ్ఞానాన్ని పొంది పరమాత్మను కీర్తించే ప్రయత్నం చేశాడు కానీ పూర్వ జన్మల పాప

ఫలాలు ఏకాగ్రతకు భంగం కలిగిస్తున్నాయి (తొందరపాటు తనం నిలకడలేని మనసు) తాను చేసిన పాపకార్యాలు ("ఎటుల బ్రోతువో తెలియ" మొదలైనవి) గుర్తుకొస్తున్నాయి. పాప ఫలాన్ని పోగొట్టి నన్ను ఎవరు రక్షిస్తారు. ధనాన్ని అర్థించి దుర్మార్గులైన రాజులను దొరా! నీవు నన్ను రక్షించు అని అనలేను ("దుర్మార్గ చరాధముల దొర నీవన జాలరా") ముందు ఇలాంటి పనులు చేసి పాపాన్ని మూట కట్టుకున్నాను (నర స్తుతి చేయకూడదని) అని మొసలి చేత పట్టుబడిన గజేంద్రుడు లాగా పరితపించి అనేక విధాల (అనేక కృతులు గానం చేసి) పశ్చాత్తాపం కన్నా ప్రాయశ్చిత్తం లేదని భావించి దయామయుడైన పరమాత్మను నీవు తప్ప నన్ను రక్షించేవారు లేరని ("దుడుకు గల నన్నే దొర కొడుకు బ్రోచురా") అంటూ ఆర్తిగా ప్రార్థించాడు. పాప ఫలాలు నశించాయి. ఏకాగ్రత కుదిరింది. భగవంతుని మీద విశ్వాసం పెరిగింది. కీర్తనలు ఆలపించే ప్రయత్నం చేశాడు. తాను నిరంతరం భగవత్ చింతనలో కీర్తిస్తూ ఉండాలి అనుకున్నాడు. సత్కావి హృదాలయుడైన పరమాత్మ తన మనసులో నుండి అప్పుడప్పుడు మాత్రమే కవిత్వం చెప్పడం ప్రారంభించాడు. తన మనసులో నిలబడం లేదు తన మొర వినడం లేదు మనసులో సాక్షాత్కరించడం పరమాత్మకు ఇష్టం లేదేమో అని బాధపడుతూ మనసుకు చెప్పుకున్నాడు (సాధించెనే ఓ మనసా"). (తాను సమయ సందర్భాలను బట్టి క్షేత్ర దర్శనం చేసినప్పుడు నేత్రాది ఇంద్రియ ప్రభావంతో మాత్రమే కీర్తనలు ఆలపించేవాడు అని గ్రహించాలి). చెప్తూ ఉంటే విని రాయడం కంటే పుస్తకం చేతికి ఇచ్చి చూసి రాయమంటే ఎంత బాగుంటుంది అన్నట్లుగా పరమాత్మ సాక్షాత్కరిస్తే చూసి కీర్తించాలనే కోరిక బలంగా ఉన్నవాడతడు.

సంగీత సంప్రదాయకుడు వేదసార హితుడు అయిన పరమాత్మ, లోకంలోని సంగీత సాహిత్యాలు కవుల హృదయాలలో నివాసంగా ఉండి పలికించినవే. పరమాత్మ మాటల ద్వారా పలికిస్తే రాసిన వారు కవులుగాను, పరమాత్మ మనో నేత్రాలకు సాక్షాత్కరించగా పరమానందాన్ని అనుభవిస్తూ రాసిన వారు పరమ భక్త కవులుగాను కీర్తింపబడ్డారు. భగవత్ లీలా విశేషాలు విచిత్రంగా ఉంటాయి. ఎవరికి ఎంత ఇవ్వాలి ఎప్పుడు ఇవ్వాలి ఏమి ఇవ్వాలి అనేది బాగా తెలిసినవాడు భగవంతుడు. చేసే ప్రయత్నంలో ఉన్న సారమెంత

అని చూసి ఫలాలు ఇచ్చేవాడు పరమాత్మ. ఈ విశేషం తెలిసినవాడు కనుక తన ప్రయత్నాన్ని మానుకోకుండా కృష్ణా రామా గోవిందా అని అనేకమార్లు (కృతులు) మొరపెట్టుకున్నాడు. ("నగుమోము గనలేని నా జాలి తెలిసి" మొ...వి). జాలి కలిగిన పరమాత్మ మనసులో స్పష్టంగా సాక్షాత్కరించక పోయినా (సాధించెనే....) కానీ ఆవేశం పనికిరాదని సహనం ఓర్పు ఉండాలని పరమభక్తుల పద్ధతిని తెలిసి కీర్తించే ప్రయత్నం చేయమన్నాడు. ఆ మాటలు విని భగవత్ సాక్షాత్కారానికి అతి చేరువలో ఉన్నానని గ్రహించాడు.

పరమాత్మ బోధన విధిగా పాటించి "బ్రోవ భారమా రఘురామ" అంటూ అనేక కృతులను గానం చేస్తూ భగవత్సాక్షాత్కారం కోసం ప్రయత్నించాడు. భక్తి జ్ఞాన వైరాగ్యాలు ఏకమైన పరమభక్తిని ప్రకటించి ధ్యానం చేస్తున్న క్రమంలో చూడగా చూడగా చూడాలనిపించే దివ్యసుందరరూపం మనసులో కనిపించింది. ఆ సుందర రూపాన్ని చూసి ఆనంద పరవశుడై పరమాత్మను అనేక విధాల ప్రస్తుతించాడు. (కన కన రుచిరా) ఇందుకోనేమో శివ బ్రహ్మాది దేవతలు, భాగవతోత్తములు "పాలు గారు మోమున శ్రీ అపార మహిమ దనరు" పరమాత్మ అద్భుత దృశ్యం కోసం ఎదురుచూసే వారిని అనుకున్నాడు. అదే సందర్భంలో పరమాత్మ దివ్య సుందరమైన రూపాన్ని దర్శించి తరించిన ఎందరో భాగవతోత్తములను (ఎందరో మహానుభావులు) కూడా దర్శించి వారికి వినయంతో నమస్కరించాడు. అప్పటి నుండి తన జీవిత పర్యంతం పరమానందాన్ని అనుభవిస్తూ పరమాత్మను కీర్తిస్తూ పరబ్రహ్మ స్థానాన్ని అలంకరించి త్యాగబ్రహ్మగా కీర్తి గడించాడు.

జీవాత్మ పరమాత్మ సంబంధమైన రామాయణ గాథ ఇందులో కనిపిస్తుంది. (సీత జీవాత్మ రాముడు పరమాత్మ) నాగలి చాలులో పుట్టి సీత అనే పేరుతో పిలువబడుతూ జనకమహారాజు పోషణలో పెరగడం వల్ల జానకి అయింది. జానకి అంటే ప్రాణి అనే అర్థంలో కూడ అన్వయించడం జరిగింది. ప్రాణి అంటే జీవాత్మ, ప్రాణి పుట్టుకకు కారణమైన వాడు పరమాత్మ. జీవాత్మ అయిన జానకి పరమాత్మ అయిన రాముని (జగదానందకారకుని) గొప్పదనాన్ని (వేదసారాన్ని) స్వయంవరం (ఇష్టపడి) సమయంలో తెలుసుకుంటుంది. పరమాత్మ అనుగ్రహానికి పాత్రురాలు అవుతుంది.

పరమాత్మను విడిచిపెట్టి ఉండలేని జీవాత్మ సకల భోగాలను వదులుకుంటుంది. తనవెంట పరమాత్మ ఉన్నా జీవాత్మకు కోరిక పుట్టడం ప్రారంభమయ్యింది. (బంగారు జింకను కోరడం), ఆ క్రమంలో తొందరపాటు (దుడుకుగల)తో నిష్కారణంగా పరనింద చేసింది. (లక్ష్మణ స్వామిని పరుషమైన మాటలతో మాట్లాడింది). ఆ కారణంగా అరిషడ్వర్గం (కామక్రోదాది....) అనే రావణుడు జీవాత్మను ఆవహించింది. జీవాత్మ తను చేసిన తప్పును గుర్తుచేసుకుని పశ్చాత్తాపంతో కుమిలిపోయింది. పరమాత్మ తన దగ్గరకు రాకుండా సాధిస్తున్నాడు (సాధించెనే ఓ మనసా) అని మనసులో బాధపడింది. కొన్నాళ్ళకు పరమాత్మని చింతనలో ఉన్న ఆ జీవాత్మ అదృష్టం వల్ల పరమాత్మ మాటలు వినిపించాయి. (ఉంగరాన్ని ఇస్తూ రాముడు తనతో చెప్పిన మాటలను హనుమంతుడు సీతమ్మకు చెప్పడం. రాముని గొప్పదనాన్ని క్షేమ సమాచారాన్ని తెలియజేయడం). జీవాత్మ ఏకాగ్రతకు భంగం కలిగించే అరిషడ్వర్గమనే రావణుని పరమాత్మ సంహరించగా జీవాత్మ ఏకాగ్రతతో పరమాత్మను ధ్యానించగా పరమాత్మ అనుగ్రహించి సాక్షాత్కరించాడు. మళ్ళీ కొత్త అనుభూతితో కొత్త రూపాన్ని చూస్తున్నట్లు జీవాత్మ పరమాత్మను చూస్తూ ఉండిపోయింది. ("కన కన రుచిరా.....") (రావణాసుర సంహారం తరువాత సీత రాముని చూడడానికి వచ్చినప్పుడు). ఆనంద సాగరంలో మునిగిపోయింది.



పరమాత్మ ప్రాభవాన్ని చూసి (రాముని పట్టాభిషేకం) తరించాలని వచ్చిన దేవాదులను, ఋషులను, భక్తులను చూసిన జీవాత్మ వారందరికీ గౌరవప్రదంగా నమస్కరించింది (ఆహ్వానించింది) (ఎందరో మహానుభావులు అందరికీవందనములు.)అప్పటినుండిజీవాత్మ పరమానందాన్నిఅనుభవిస్తూనే

ఉంది. కాలక్రమంలో కారణం చిన్నదైనా (చాకలి వాడి అపవాదు – 'నింద లేనిదే బొందు పోదు' అన్న తెలుగు సామెత) జీవాత్మ తాను వచ్చిన చోటుకు తిరిగి మళ్ళీ వెళ్ళవలసిందే అందుకే పరమాత్మ నుండి జీవాత్మ వేరుపడి సంగీత సాహిత్య (లవ కుశ) సమ్మిళితమైన (కలయిక అయిన) కృతులను లోకానికి ప్రసాదించి పరమాత్మలో ఐక్యం అయింది.



కాయైనా కాయమైనా పరిక్వత చెందితేనే మధురమనే పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది అన్న సందేశాన్ని ఇచ్చే సంక్షిప్త వ్యాసం. మానవ జీవిత పరమార్థాన్ని తెలుసుకొని (జగదానంద కారక....") తొందరపాటు తనం (దుడుకుతనం) లేకుండా, యోగ్యత లేని సమయంలో ప్రయత్నం చేసి మనసులో బాధపడకుండా (సాధించెనే) ఓర్పు వహించి కాలక్రమంలో అనుభవంతో పరిపుర్ణ జ్ఞానాన్ని సముపార్జన చేసి అప్పుడు ప్రయత్నం చేస్తే అదృష్టం వరిస్తుంది (కనకన రుచిరా), ఆ విజయాన్ని విన్న, చూసిన పెద్దలు (ఇదే విజయాన్ని పొందిన మహాత్ములు) ప్రశంసిస్తూ ఉంటే వారి ప్రశంసకు కృతజ్ఞతగా గౌరవంతో వారికి నమస్కరించాలి. (ఎందరో మహానుభావులు అందరికీ వందనములు)

పంచేంద్రియాలు (జ్ఞాన, కర్మ, తన్మాత్ర) పంచప్రాణాలు కలిగిన పాంచభౌతిక (పంచభూతాలు) శరీరంతో జీవించే మానవునికి పంచ సూత్రాలుగా (పశ్చాత్తాపం, ఆత్మవిమర్శ, ఆత్మశుద్ధి, ఏకాగ్రత, ఆనందం) ఉపకరిస్తున్నాయి.

పాలసముద్రంలో పరమహంస పరమాత్మ పవిత్ర జలానికి (సద్గంగా జనకుడు) తండ్రి. (పాలు పవిత్ర జలాన్ని మాత్రమే ఇముడ్చుకుంటాయి) హంసగా మారిన జీవాత్మలే పరమాత్మను దర్శించగలరు. అలాంటి వారు

పరమ భాగవతోత్తములు. అలాంటి భాగవోత్తముల సరసన చేరడమే జీవిత పరమార్థమని సూచించినట్లు తెలుస్తోంది.

మానవ జీవన దశలు అన్వయించి చూడగా పుట్టుక (జగదానందకారక) పుట్టించేవాడు పరమాత్మ. బాల్యం (దుడుకుగల) బాల్యంలో తెలియని అజ్ఞానంతో చేసే పనులు కౌమారం (సాధించెనే) జ్ఞానాన్ని పొందడానికి ప్రయత్నించి ఓర్పుతో ఏకాగ్రతతో సాధించడం. యౌవనం (కన కన రుచిరా) పొందిన జ్ఞానంతో సమాజంలో మంచిని మాత్రమే గ్రహించి గొప్ప వ్యక్తిగా మారడం. వార్ధక్యం (ఎందరో మహానుభావులు) సమాజంలోని పెద్దలు, మహాత్ములు (గొప్పవారిని) భాగవతోత్తములు, సమాజిక హితులు, సంఘసంస్కర్తలు, అనదగిన వారిని గౌరవించడం. మానవ జీవన విధానాన్ని బోధిస్తుంది.

ఇందులో "ఓంకార పంజర కీర' మనే పరమాత్మ (చిలుక) పలుకు శబ్దాలంకారంగా శోభించింది. పరమాత్మ తత్వం అర్థాలంకారంగా శోభించింది. పరమాత్మ దివ్యసుందరమైన రూపానికి శబ్దార్థాలు అలంకారమై చూస్తూ ఉంటే ఇంకా చూడాలనిపించే (కన కన రుచి) సంగీత సాహిత్య శోభతో పంచరత్నాలు ప్రకాశిస్తున్నాయి. అతిశయోక్తి ఆనవాళ్ళు ఇందులో కనిపించుటలేదు.

జగదానందకారక మరియు కన కన రుచిరా కృతులను మధ్యమ పురుషలో, దుడుకుగల అనే కృతిని ఉత్తమ పురుషలో సాధించెనే ఓ మనసా, ఎందరో మహానుభావులు కృతులను ప్రథమ పురుషలో సంబోధిస్తూ కీర్తించారు.

**పంచరత్నమాలను ధరించి పరవశించి ఆడిన ఆటవెలది.**

**పంచరత్నమాల పరిమళములఁజూడ**
**పరమ భాగవతుని పరవశములు**
**రామ భక్తిఁగూర్చి రాసిన కుసుమాలు**
**త్యాగరాజ నుతుని తత్త్వ మణులు.**

## పంచరత్న కీర్తనలలో ముఖ్యమైన పదాల అర్థం, కృతిలోని తాత్పర్యం:-

### 1. జగదానంద కారకా జయ జానకీ ప్రాణ నాయక

రెండు విశేషమైన కారణాల చేత జగదానందకారక జయ జానకీ నాయకా భావాన్ని సంగ్రహించవచ్చు. లోకకంటకుడైన రావణాసురుని సంహరించి, జగత్తుకు ఆనందాన్ని కలిగించి శ్రీరాముడు జగదానందకారకుడయ్యాడు. సీతమ్మ ప్రాణాలు నిలబెట్టి జానకి ప్రాణ నాయకుడయ్యాడు. ఈ సందర్భంలో సమస్త లోకాలు శ్రీరామచంద్రునికి జయము జయము అంటూ ప్రశంసిస్తూ జేజేలు పలికాయి. అన్న భావాన్ని స్ఫురింపచేస్తోంది.

ప్రాణికోటికి నెలవైన, పంచభూత మయమైన ప్రపంచమనే పవిత్రమైన పదార్థాన్ని సృష్టించాడు పరమాత్మ. ఆ పదార్థంలోనే పుట్టిన పురుగులను (దుష్టులను) చంపి, పవిత్ర పదార్థాన్ని బాగుచేసే (సంస్కరించే) క్రమంలో అనేక అవతారాలు ఎత్తాడు. గోవింద (గో=ప్రాణి, విందు = పోషణ) అర్థంతో పోషకుడుగా, గోపాల అర్థంతో రక్షకుడుగా ఉన్న పరమాత్మ సర్వప్రాణి కోటికి జనకుడు (తండ్రి). జనక మహారాజు కుమార్తె జానకి అయినట్లు, పరమాత్మే జనకుడు అయిన ప్రతి ప్రాణి కూడా ప్రపంచమంతా స్త్రీ మయమే ("స్త్రీ ప్రాయమిదంజగత్") అన్న కారణంగా జానకి అవుతుంది. పరమాత్మ ప్రతి ప్రాణి (జీవాత్మ) అంతరంగంలో ఉన్నందువల్ల ప్రాణ నాయకుడు అయ్యాడు. ప్రాణి కోటి మయమైన జగత్తుకు పోషణ రక్షణ తానే అయి ఉండడం వల్ల జగదానందకారకుడయ్యాడు. అవతార విశేషాలతో అద్భుత విజయ పరంపరలను చరిత్రగా గలిగిన పరమాత్మకు జయము జయము అంటూ ప్రశంసిస్తున్నట్లు భావించవచ్చు.



ఈ కృతిలో పరమాత్మ ప్రాణి కోటి ఆనందానికి కారకుడని, శ్రేష్టమైన సూర్యవంశానికి చెందినవాడని, సుగుణాకరుడని, దేవతలకు మేలు చేసే కల్పవృక్షం వంటి వాడని, ఇంద్రనీలమణితో సమానమైన శరీరం కలిగి చంద్ర సూర్యులను నేత్రాలుగా కలవాడని, బ్రహ్మకు తండ్రి అని, స్వచ్ఛమైన శేషుని మీద శయనించేవాడని, అహల్యశాపాన్ని పోగొట్టినవాడని, పరమ శాంత స్వభావుడని, దుష్టశిక్షకుడని శిష్ట రక్షకుడని, సృష్టి స్థితి లయ కారకుడని, ఆశ్రిత భక్త పరాధీనుడని, ఓంకార పంజర కీరమని, కళాధరుడని పరమాత్మ తత్వాన్ని మహత్వాన్ని కీర్తించడం జరిగింది.

ఓంకార పంజర కీర"– ఓంకారం అనే పంజరంలోని చిలుక పరమాత్మ. అకారము బ్రహ్మ, ఉకరము విష్ణువు, మకారం మహేశ్వరుడు. ఈ త్రిమూర్తి స్వరూపంతో భాసిల్లే ఓంకార పంజరమే (అ+ఉ+మ్= ఓమ్) బ్రహ్మాండం. ఈ బ్రహ్మాండంలో ఉన్న చిలుక (పదార్థం) పేరు రామ (పరమాత్మ). ఈ చిలుక ఓంకార నాదాన్ని పలుకుతుంది. ఈ చిలుక శివ స్వరూపంగా, బ్రహ్మ స్వరూపంగా, విష్ణ స్వరూపంగానే కాకుండా అనేక రూపాల్లో దర్శన్మిస్తుంది (".....పురహర సరోజ భవ కేశవాది....." అవతార విశేషాలు).

కళాధర'– పరమాత్మ ప్రధానమైన 64 కళలకు మాత్రమే కాకుండా సమస్త కళలకు ఆధారభూతమైనవాడు, సమస్త కళలను ధరించినవాడు (పోషిస్తున్న వాడు) సమస్త కళలను ప్రదర్శించేవాడు. ఏదైనా ఒక పనిని అందంగా నైపుణ్యంగా చేస్తే దానికి కళ అని పేరు. ఉత్సాహాన్ని ఆనందాన్ని ఇవ్వడమే కళ ప్రయోజనం. పరమాత్మ తన అవతార విశేషాల ద్వారా కళ ప్రదర్శించి, లోకానికి ఉత్సాహాన్ని ఆనందాన్ని అందించాడు. జగదానంద కారకుడను బిరుదు సార్థకం చేసుకున్నాడు.

## 2. దుడుకు గల నన్నే దొర కొడుకు బ్రోచురా

తొందరపాటు తనం కలిగిన అజ్ఞానంతో చెడు పనులు చేసి తిరిగే నన్ను ఏ రాజు కొడుకు ఆదరిస్తాడు? ఆదరించడు అని భావం. ఉన్న రాజులేమో దుర్మార్గపరులు. ధనాన్ని ఆశించి దొరా! నన్ను ఆదరించు అని అనలేను. ("దుర్మార్గచరాధములదొరనీవనజాలరా")చేసినతప్పుమళ్ళీమళ్ళీచేయలేను,

ముందు ఇలాంటి తప్పు చేసే పాపాలు మూటగట్టుకున్నాను. దొర'- ఆర్థికంగా స్తోమత, సామాజికంగా మంచిపేరు, మనసికంగా మంచి వ్యక్తిత్వం ఉండి, ఇచ్చే హృదయం (దా+ఉర= దొర) లేదా ఆదరించే గుణం కలవాడికి దొర అని పేరు. సద్గుణ, దాన శీలము కలిగిన రాజు అని అర్థం. ఈ రాజుధర్మాచరణ కలిగినవాడు, పేదవారిని ఆదరిస్తాడు. కానీ అధర్మం మార్గంలో తిరిగే దుడుగలవారిని దుర్విషయాసక్తుల్ని ఆదరించడు. రాజే ఆదరించకపోతే కొడుకు ఆదరించలేడు. కానీ రాజ శ్రేష్టుడైన దశరథ మహారాజు కొడుకు అయిన రామచంద్రుడు తప్పులు మన్నించి రక్షించే దయాసముద్రుడు కాబట్టి ఆదరించగలడని 'కడుదుర్విషయాకృష్ణుడు' చేసిన తప్పులను ఒప్పుకొని పశ్చాత్తాపంతో శ్రీరామునికి ఇలా మొరపెట్టుకున్నాడు.

శ్రీదేవి హృదయమనే కలువకు చంద్రుడవు మాటకు మనసుకు అర్థంకాని వాడవు అయిన రామా! సకల ప్రాణులతో అంతరాత్మగా పరమాత్మ ఉంటాడని తెలిసినా కూడా మరిచిపోయి ప్రవర్తించాను. ఏమాత్రం ప్రేమ లేకుండా ఇతరుల పట్ల కఠినంగా ప్రవర్తించాను, ఇతరులను మంచి మాటలతో ఆకర్షించి ధనాన్ని అర్థించడం సుఖాన్ని అనుభవించడమే జీవితం అనుకున్నాను, దుర్మార్గులతో కలసి తిరుగుతూ కూడా మంచి భక్తుణ్ణి అని గొప్పలు చెప్పుకొని భార్యలు ఆస్తులు బిడ్డలు పరివారము ధనాన్ని శాశ్వతమని నమ్మి, శాశ్వతుడైన భగవంతుని పాదపద్మాలను కీర్తించే అలవాటును మానుకున్నాను. దురాశను పోగొట్టుకోలేక నిలకడ లేని మనస్కుడై



తిరిగాను మానవ జన్మ గొప్పదనం తెలిసి కూడా అరిషడ్వర్గాలకు లోనై అధర్మాచరణమైన ఆచారాలను ప్రోత్సహించి ఎన్నో కష్టాలు అనుభవించాను. కాలాన్ని వ్యర్థం చేసుకున్నాను అంటూ పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం

లేదనీ ఆర్తితో శరణాగతి సమర్పించాడు. ఇలా భగవదనుగ్రహానికి పాత్రుడయ్యాడు పరమాత్మను కీర్తించడం మొదలుపెట్టాడు.

## 3. సాధించెనే ఓ మనసా

సాధించెనే'– సాధించడం అంటే మాటల ద్వారా చేతల ద్వారా తన మనసులోని కోరికను పట్టుదలతో నెరవేర్చుకోవడం వల్ల పొందే విజయం. ఒకరు విజయాన్ని పొందితే మరొకరు అపజయాన్నిపొందవలసినదే, విజయం పొందినవారికి ఆనందం అపజయం పొందిన వారికి బాధ ఉంటాయి. మాటల్లో చేతల్లో ప్రభావం లేకపోయినా, అధర్మం అని తెలిసినా, మోసపురితమైన, పెత్తనం లేదా అధికారం ఉంటే పట్టుబట్టి (ఇతరులను బాధించి) కొన్ని సాధించవచ్చు.



సాధించెనే'– (కాలయాపన చేయడం) కానీ ఇక్కడ పరమాత్మ బంధాన్ని తెంచుకోలేక, సరైన సమయం రాక (భక్తునిలో పూర్తి పరిణితి రానందువల్ల) కాలయాపన చేశాడు.

తప్పులు చేసి ఆ తప్పులు తెలుసుకుని పశ్చాత్తాపపడి గీత, సంగీత జ్ఞానంతో భగవంతుని ప్రార్థిస్తే ఫలితం లేకపోయింది. గీతలో తాను చెప్పిన విషయాలు అనుసరించి ఆచరిస్తూ కీర్తిస్తున్నా సంగీత సంప్రదాయకుడు అయిన పరమాత్మ తాను బోధించిన సన్మార్గ వచనములు (గీత) నిజం కాదన్నట్లు (బొంకు జేసి) పరమాత్మ మనసులో సాక్షాత్కరించకపోవడం సాధించడంగా (కాలయాపన చేస్తున్నాడని) భావించి ఓ మనసా! అనుగ్రహించకూడదని అనుకుంటున్నాడేమో పరమాత్మ ఎంత పట్టుపట్టి సాధిస్తున్నాడు అని మనసుకు చెప్పుకున్నాడు. "నగుమోము గనలేని నా జాలి తెలిసి" లాంటి అనేక కృతులలో తన ఆర్తిని ప్రకటించాడు. కీర్తిస్తూ ఉన్నప్పుడు

మాత్రం సమయానికి తగ్గట్టుగా మాట్లాడి (కీర్తనకు కావలసిన జ్ఞానాన్ని మాటల రూపంలో ఇచ్చి) తప్పించుకున్నాడు. అంటే తాను కీర్తించే కీర్తనకు కావలసిన సంగీత సాహిత్య జ్ఞానం సత్కకవి హృదాలయుడైన పరమాత్మ పలికించేవి అని అర్థం. మనోనేత్రంతో పరమాత్మ దివ్య సుందర రూపాన్ని చూసి పరమానందాన్ని అనుభవిస్తూ ఆలపించిన కీర్తన అమృతప్రాయమవుతుంది. కానీ దానికి ఇంకా సమయం ఉందిలే అని పరమాత్మ కేవలం మాటలతోనే సరిపుచ్చి కనిపించకుండా తప్పించుకున్నాడు. మరొకసారి ప్రయత్నించి (కీర్తించి) పరిశీలించి పరిశోధించి చూడగా సమయానికి తగిన మాటలు ఇలా మాట్లాడాడు. (సమయానికి తగు మాటలాడెనే'– సమయ సందర్భాల్ని బట్టి, సమయస్ఫూర్తితో నేర్పుతో మాట్లాడడం అని భావం. ఇలా మాట్లడే వారిని మాటకారి అని పిలుస్తాం.)

దేవకీ వసుదేవులను 'ఏగించినట్లు మాట్లాడాడు ('ఏగించు' – పంపించు, ఆజ్ఞాపించు, త్రిప్పు, సరిపడు అనే అర్థాలున్నాయి. తన మాటకు ఎదురు చెప్పకుండా ఉండేటట్లు చేయడం.) పుట్టగానే తనను రేపల్లెలో యశోదమ్మ ఇంటికి చేర్చమని చెప్పినప్పుడు వారి మనస్సు అంగీకరించి ఉండదు. కారణం ఏ తల్లిదండ్రులైన పుట్టిన పసికందు ఆలనాపాలన ముద్దు మురిపాలు వాత్సల్యంతో చూసుకోవాలని అనుకుంటారు. బిడ్డను దూరం చేసుకోవాలని ఏ తల్లిదండ్రులు అనుకోరు. పరమాత్మ ఆ సమయానికి తగిన మాటలు మాట్లాడి వారిని ఒప్పించి తన మాటకు ఎదురు చెప్పకుండా ఉండేటట్లు చేసి తాను అనుకున్న పని నేరవేర్చుకున్నాడు. దేవకి వసుదేవులు పరమాత్మ ఆజ్ఞను లీలా విశేషంగా భావించారు. కాబట్టి కంసుని ఆట కట్టించగలిగారు.



'రంగేశుడు సద్గంగా జనకుడు సంగీత సంప్రదాయకుడు" సమయానికి తగ్గట్టు మాట్లాడి అంతలోనే మాయమయ్యాడు.

రంగేశుడు'– శ్రీరంగంలో వెలసిన శ్రీ రంగనాథుడు. నాటకరంగమనే ప్రపంచానికి ప్రభువైనవాడు. జగత్తును పోషించేవాడు.

సద్గంగా జనకుడు'– పవిత్రమైన గంగకు తండ్రి మహావిష్ణువు. ప్రాణికోటికి ప్రాణాధారమైన గంగకు తండ్రి. జగత్తును రక్షించువాడు.

సంగీత సంప్రదాయకుడు'– సంగీత సంప్రదాయాన్ని లోకంలో ప్రవేశపెట్టిన వాడు. సంగీతం యొక్క గొప్పదనాన్ని తెలియజేసి, కలియుగంలో సంగీత ప్రధాన్యతను గుర్తుచేసినట్లుగా ద్వాపరయుగంలోనే వేణురవామృతాన్ని లోకానికి పంచిపెట్టాడు. ఇది సంగీత విద్యను సంప్రదాయంగా చేసుకుని మానవ జీవితాన్ని సార్థకం చేసుకోమని సూచించినట్లుగా బోధపడుతుంది. జగత్తును పోషించి, రక్షించేవాడు. సంగీత సంప్రదాయంతో (సంగీత జ్ఞానం) కీర్తించిన వారికి మోక్షాన్ని ఇచ్చే

శ్రీకృష్ణుడు సమయానికి తగిన మాటలు మాట్లాడి నన్ను ఏమార్చాడు.

గోపికల మనసులోని కోరికను తీర్చకుండా ఎగతాళి చేసి ఆ సమయానికి తగిన మాటలుతో సర్దిచెప్పి ఎలా వారిని ఏమార్చాడు అదేవిధంగా నన్ను కూడా ఏ మార్చాడు.

గేలియుఁజేసే'– (ఎగతాళి పరిహాసము వేళాకోళం అని అర్థం. వేళాకోళం అంటే చిక్కు, చిక్కుతో కూడినది అని, అంటే అర్థం కానిది అని భావం.) అడిగింది ఇవ్వకపోయినా, చెప్పింది చేయకపోయినా ఎగతాళి చేసినట్లు అని అర్థం.

గోపికల మనసులోని కోరికలను తీర్చడం ఇష్టం లేకనే అనేక సందర్భాల్లో వారితో వేళాకోళం చేశాడు. అర్థం కాని విధంగా వారితో ప్రవర్తించాడు. బలరామకృష్ణులు మధురకు వెళ్ళే సందర్భంలో మళ్ళీ వస్తానని వారికి ఆ సమయానికి తగినట్టుగా మాట్లాడి ఒప్పించి మధురకు వెళ్ళాడు. చాలాకాలం తర్వాత గాని గోపికలకు కనిపించలేదు. ఇలా గోపికలను ఏమార్చాడు. అదేవిధంగా నన్ను కూడా మాటలతో ఏమార్చాడు.

కొడుకని యశోద వాత్సల్యంతో ముద్దు పెట్టుకుంటే నవ్వినట్లు, అదేవిధంగా నా ప్రార్థన పట్టించుకోకుండా నవ్వు నవ్వి వెళ్ళిపోయాడు. కానీ ప్రయత్నం ఆపకుండా కలి బాధలను తీర్చే పరమ భక్త వత్సలుడని హరే రామచంద్ర అని, శ్రీ వేంకటేశా అని పరిపరివిధాల స్తుతించగా పూజలను స్వీకరించాడు. కాని దగ్గరకు రాకుండానే పరమభక్తుల పద్ధతులు ఇలా ఉంటాయని, దుష్టులతో సహవాసం చేయవద్దని, బాధ కలిగినప్పుడు కొంత సహనం ఓర్పు వహించమని, మాటలతోనే సరిపెట్టి మాయమయ్యాడు. కానీ పరమాత్మ సాక్షాత్కారానికి మరెంతో సమయం పట్టదని అర్థమైంది. "బ్రోవ భారమా రఘు రామ" అంటూ అనేక కృతులు గానం చేసిన తర్వాత పరమాత్మ కనిపించాడు.

## 4. కన కన రుచిరా కనకవసన నిన్ను

బంగారు రంగు పట్టువస్త్రాలు (పట్టు పీతాంబరం) ధరించిన నిన్ను చూడగా చూడగా ఇంకా చూడాలనిపించే విధంగా ఉంది (ఎంతసేపు చూసినా తనివి తీరటం లేదు అని భావం) అంటూ

(దినమును దినమును నా మనమున చనువున'-) ప్రతిదినము మనస్సులో ఇలా నిన్ను చూస్తూ ఉంటే చనువు (భక్తి) పెరుగుతోంది. మన పరిచయం బలపడుతోంది, నీకు మరింత దగ్గర అయినట్టు అనిపిస్తుంది, దాని ఫలితంగా నీ సౌందర్యం రెట్టింపు అవుతోంది. నా లో పరవశం ఎక్కువై పరమానందం కలుగుతోంది.



పాలుగారే నునులేత (మనోజ్ఞమైన) ముఖంలో శోభించే అంతులేని ప్రభావంతో ప్రకాశించే నిన్ను చూస్తున్న కొద్దీ చూడాలనిపిస్తోంది. తళతళ మెరిసే ముఖం కలిగిన అందమైన సీత కూడా విలాసంతో నిన్ను ఓరకంటితో చూసింది.

అలాంటి నీ సర్వాంగ సుందరమైన స్వరూపానికి మరింత శోభను చేకూర్చే మణిమయ ఆభరణాలు కాంతులు తనివితీరా చూడాలనిపిస్తోంది. సవతి తల్లి (సురుచి) మాట్లాడిన సూదులతో చురుక్కని గుచ్చినట్లు అనిపిస్తే ఆ బాధ భరించలేక శ్రీహరిని ధ్యానించి ధ్రువుడు పరమానందాన్ని పొందినట్లుగా, అశోకవనంలో హనుమంతుడు నీ గొప్పదనాన్ని వర్ణించి చెప్తున్నప్పుడు విని సీత పరవశించినట్లుగా నేను కూడా నిన్ను చూస్తూ అంత పారవశ్యాన్ని పొందాను. చిదానంద స్వరూపముతో పరమ దయతో కరుణ రసాన్ని కురిపించి రక్షించే రామచంద్రా! నీ సౌందర్యం యొక్క గొప్పదనాన్ని నేను అతిశయోక్తిగా చెప్పడం లేదు అనడానికి పరమప్రేమతో నీ పాదపద్మాలను విడిచిపెట్టకుండా పట్టుకున్న హనుమంతుడూ సాక్షి, రామ నామామృతం రుచి తెలిసిన శివుడు సాక్షి, మరియు పరాశరుడు, శుకుడు, శౌనకుడు, ఇంద్రుడు, పార్వతి, సీత మొదలైన వారు సాక్షులు. ఇలా నిన్ను ఆశ్రయించిన భక్తులకు మాత్రమే నీ సుందర రూపంలోని కమ్మదనం (రుచి) కనిపిస్తుంది. అందుకే శాశ్వతమైన లేదా తరగని ప్రేమను కురిపించే నిన్ను తనివితీరా చూస్తూ పరమానందాన్ని పొందుతున్నాను అని పరమాత్మకు కృతజ్ఞతలు తెలియజేశాడు.

## 5. ఎందరో మహానుభావులు అందరికీ వందనములు

పరమాత్మ సౌందర్యంలోని కమ్మదనాన్ని ఆస్వాదించడానికి ప్రయత్నం చేసి పరమానందాన్ని పొంది భక్తశిఖామణులుగా పేరుగాంచిన ("చందురు వర్ణుని అంద చందమును హృదయార విందమున జూచి బ్రహ్మానందమనుభవించువారు")

భాగవతోత్తములు అందరికీ వినయంతో నమస్కరించి భగవత్ దాసాను దాసుడనని ప్రకటించుకున్నాడు. ("ఎందరో మహానుభావులు అందరికీ వందనములు").

సంగీత జ్ఞానంతో కీర్తించేవారు అంటే ఇష్టపడే రామా! మన్మధుని వంటి రూప లావణ్యాన్ని చూసే అదృష్టం కలిగ ధన్యులు అయిన, ప్రహ్లాద తత్వంతో కూడిన వారెందరో వారందరికీ (మూర్ధన్యులు), త్వరితగతిన ఏకాగ్రతను

పొంది పవిత్రమైన నీ పాదాలకు మనసనే పద్మాన్ని సమర్పించిన వారెందరో వారందరికీ. జీవిత పరమార్థమైన, సంగీత జ్ఞానంతో ("సంగీత జ్ఞానం భక్తి వినా సన్మార్గము కలదే") కీర్తించే వారెందరో వారందరికీ, హరి గుణాలు అనే మణిమాలను కంఠంలో ధరించిన అనేకమంది భక్తులు జ్ఞానంతో స్నేహంతో దయతో లోకాన్ని అమృత చూపులతో చూసి ఆదరించే వారెందరో వారందరికీ, విలాసం అతిశయించగా నడిచే రసజ్ఞుడవైన నిన్ను ఎల్లప్పుడూ చూస్తూ పులకించి ఆనంద సాగరంలో మునిగి శాశ్వత కీర్తిని పొందిన వారెందరో వారందరికీ, వీరేకాకుండా పరమ భాగవతోత్తములు ముని శ్రేష్టులు చంద్రుడు సూర్యుడు సనకసనందనాదులు దిక్పాలకులు దేవతలు కింపురుషులు ప్రహ్లాదుడు నారదుడు తుంబురుడు హనుమంతుడు శివుడు బ్రహ్మ బ్రహ్మాణులు, పవిత్రులు గొప్ప కీర్తిని పొందినవారు (ఘనులు శాశ్వతులు) పరమానందాన్ని (కమల భవ సుఖము) నిరంతరం అనుభవించిన వారెందరున్నారో వారందరికీ, నీ సుందర శరీరాన్ని నామ ప్రభావాన్ని పరాక్రమాన్ని ధైర్య శాంతములను సత్య నిష్ఠను తెలుసుకుని నీమీద పరమభక్తి కలిగినప్పుడు సనాతనం కానీ ప్రామాణికత లేని చెడు ఆచార వ్యవహారాలు కలిగిన మతములను తప్పని రుజువు చేసి పరమ భక్తితో నిన్ను కీర్తించే వారెందరో (ఆళ్వారులు) వారందరికీ, భాగవత రామాయణ గీతాది శృతి శాస్త్ర పురాణ రహస్యాల్ని శైవాది ఆరు మతాలలో చెప్పబడిన పరమార్థాన్ని 33 కోట్ల దేవతల మనోభావాల్ని తెలుసి భావము రాగము లయతో కూడుకున్న కీర్తన ఆలపించడం (గొప్ప సంగీతజ్ఞులు) ద్వారా కలిగే ఆనందం చేత మానసిక ఆరోగ్యంతో దివ్యత్వం (చిరాయువుల్) కలిగి అంతులేని ఆనంద పరవశులై త్యాగరాజుకు అత్యంత కావలసిన (ఆప్తులు) వారెందరో వారందరికీ, ప్రేమ భక్తి, జ్ఞాన వైరాగ్య మనే మూడు పిరులు (ముప్పిరి) ఒక్కటిగా కలిసి గట్టితనం పొంది పరమభక్తిగా పరిణమించగా రామనామాన్ని స్మరించి కీర్తించే వారు త్యాగరాజ నుతుని (శ్రీరాముని) నిజమైన దాసులెందరున్నారో అలాంటి భాగవోత్తములందరికీ వందనాలు అంటూ గౌరవప్రదంగా నమస్కరించాడు.

ప్రేమ ముప్పిరిగొను' – మూడు పిరులు = మూడు పిరులు అంటే మూడు ముళ్ళు వేయబడి గట్టిపడినట్లు లేదా మూడు పేటలు (త్రాళ్ళు) మెలి వేయబడి

ఒక త్రాడుగా ఏర్పడి గట్టిదనాన్ని పొందినట్లు భక్తి జ్ఞానవైరాగ్యాలు ఒక్కటై పరమ ప్రేమ స్వరూపుడైన భగవంతుని అంతే పరమ ప్రేమను ప్రకటించి కీర్తించిన వారు పరమాత్మకు నిజమైన దాసులు అని భావం. ఇది భక్తునికి భగవంతునికి మధ్య సంబంధం లేదా జీవాత్మ పరమాత్మల సంబంధం. మధుర భక్తి అని దీనికి పేరు.

## స్ఫూర్తి సందేశం :-

మానవ జీవితాన్ని సార్థకం చేసుకోవాలనుకున్న వారు ఆలోచనలు లేని మనసులో ఏకాగ్రతను సాధించి, పంచరత్న కృతుల భావాన్ని అర్థం చేసుకుని, పరమాత్మ సుందర రూపాన్ని దర్శించి పరవశించి సంగీత జ్ఞానంతో గానం చేస్తే, పరమానందాన్ని పొందగలరు, పరమ భక్తుల సరసన చేరగలరు.

> ఎందరో మహానుభావులు అందరికీ వందనములు
> పరమార్థమగు నిజ మార్గముతోను బాడుచును
> సల్లాపముతో స్వర లయాది రాగముల దెలియు
> వారెందరో మహానుభావులు
> హరిగుణ మణిమయ సరములు గళమున
> షోభిల్లు భక్త కోటులిలలో తెలివితో చెలిమితో
> కరుణ గల్గి జగమెల్లను సుధా దృష్టిచే
> బ్రోచువారెందరో మహానుభావులు
>
> హొయలు మీర నడలు గల్గు సరసుని
> సదా కనుల జూచుచును పులక శరీరులై
> ఆనంద పయోధి నిమగ్నులై ముదంబునను యశము
> గలవారెందరో మహానుభావులు
>
> – త్యాగరాజ

# తెలుగు సాహిత్య రంగాన్ని సంపన్నం చేసిన తాళ్ళపాక కవులు



ఆచార్య పి. ఆర్. హరినాథ్
✆ 94804 43108

సాహిత్యరంగంలోకొన్నిఅపురూపసన్నివేశాలుకనిపిస్తుంటాయి. ఇవిఎప్పుడో గానీ జరగవు. ఒక వంశానికి చెందిన వారంతా సాహిత్యం కోసం, సంప్రదాయం కోసం కృషి చేయడం అనేది అలాంటి దృశ్యం. తాళ్ళపాక వారి విషయంలో ఇదే జరిగింది. పద సాహిత్యం కోసం, సంకీర్తనా వాఙ్మయం కోసం వారు చేసిన కృషి మరొకచోట కనిపించదు.

**తాళ్ళపాక అన్నమయ్య**

పదకవితాసరస్వతినిపల్లకీలకెక్కించిపాదార్చనచేసినవాడుతాళ్ళపాక అన్నమాచార్యులు.

తర్వాతి తరం వారు దానిని కొనసాగించారు. అన్నమయ్యకు రకరకల పేర్లు కనిపిస్తాయి. అన్నయాచార్యులు, అన్నమయ్యంగారు – ఇలాంటి నామంతరాలు ఉన్నాయి.



ఆయన వెంకటేశ్వర స్వామి నందకావతారమని ప్రసిద్ధి. ఇతనికి సాళ్వ నరసింగరాయలు సమకాలికుడు (క్రీ.శ 1485-92). వారిద్దరి మధ్య మైత్రీబంధం కూడా

ఉంది. సంకీర్తనలను రక్షించడంలో నరసింగరాయల పాత్ర కూడా ఉంది. అన్నమయ్య పసితనం నుంచే ఆధ్యాత్మిక భావాలతో ఉన్నాడు. దైవభక్తి ఎక్కువ. ఆయనకు పదహారవ ఏట స్వామి సాక్షాత్కారం అయ్యిందని అంటారు. నాటి నుంచి ప్రతిరోజు ఒక సంకీర్తనకు తక్కువ కాకుండా రచించాడు. "ఆడిన మాటల్లా నమృత కావ్యమును – పాడిన పాటల్లా పరమ గానమును" అయ్యాయి. సంకీర్తనా రచనకు శ్రీకారం చుట్టినవాడు అన్నమయ్య. ఆయన సంకీర్తనలు అధ్యాత్మ, శృంగార, వైరాగ్య సంకీర్తనలుగా విభక్తమైనాయి. ముప్ఫయిరెండువేల సంకీర్తనలు ఆయన రచించాడు. సంకీర్తనలకు ఒక నిర్దిష్ట స్వరూపాన్ని కల్పించినవాడు, అన్నమయ్య. సంకీర్తనా పద్ధతిలో ఆయన రచన అందరికీ దారిదీపమయ్యింది. ఆ తరువాతనే కన్నడంలో పురందర దాసు, ప్రాకృతంలో వెంకటమఖి సంకీర్తనలను రచించారని ప్రతీతి.



ఆ కాలంలో పురందర దాసు తిరుమలలో స్వామి దర్శనం కోసం వచ్చి, అన్నమయ్యను కలిశాడు. వారు పరస్పరం గౌరవించుకున్నారు. తాళ్ళపాక వారి సంకీర్తనలకు పురందర దాసుల వారి సంకీర్తనలకు చాలాచోట్ల సామ్యం కనిపిస్తుంది. కొన్ని సంకీర్తనల ఎత్తుగడ కూడా ఒకలాగే ఉండడం విస్మయం కలిగిస్తుంది.

"నారాయణతే నమో నమో
భవనారద సన్నుత నమో నమో"

అనే సంకీర్తనలో చివరి చరణంలో "నాద ప్రియతే నమో నమో" అని అన్నమయ్య రచన ఉండగా "పురందర విఠల తే నమోనమో" అని పురందర దాస సంకీర్తనలో కనిపిస్తుంది. ఈ ఒక్కమార్పు మినహా మొత్తం కీర్తన అంతా

ఒకటే ఉంటుంది.

అలాగే

**శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీ సతి వల్లభ**
**శరణు రాక్షస గర్వ సంహార శరణు వెంకట నాయకా"**

అని అన్నమయ్య రచన ఉండగా,

**శరణు శరణు సురేంద్ర వందిత శరణు శ్రీపతి సేవిత**
**శరణు పార్వతి తనయ మారుతి శరణు సిద్ధివినాయక"**

అని పురందర దాస రచనలో కనిపిస్తుంది. బహుశా ఇద్దరికీ ఉన్న మానసిక సామీప్యం రచనలో కూడా ప్రతిఫలించిందేమో.

అన్నమయ్య ఎంతటి భక్తుడో అంతటి భావుకుడు కూడా. వేదాంత విషయాలను కూడా కవితాత్మకంగా వ్యక్తీకరించిన సౌకుమార్యం ఆయనది.

**"ఏమొకో చిగురటధరమున ఎడనెడ కస్తూరి నిండెను**
**భామిని విభునకు రాసిన పత్రిక కాదు గదా -"**

**"ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన, అంతమాత్రమే నీవు**
**అంతరాంతరములెంచి చూడ, పిండంతే నిప్పటి అన్నట్లు**

**కొలుతురు మిము వైష్ణవులు, కూరిమితో విష్ణుడని**
**పలుకుదురు మిము వేదాంతులు, పరబ్రహ్మంబనుచు**
**తలతురు మిము శైవులు, తగిన భక్తులునూ శివుడనుచు**
**అలరిపొగడుదురు కాపాలికులు, ఆది భైరవుడనుచు**

**సరి మిమ్ముదురు సాక్తేయులు, శక్తి రూపు నీవనుచు**
**దరిశనములు మిము నానా విధులను, తలుపుల కొలదుల భజింతురు**
**సిరుల మిమునే అల్పబుద్ధి, తలచినవారికి అల్పంబగుదవు**
**దరిమిల మిమునే ఘనమని తలచిన, ఘనబుద్ధులకు ఘనుడవు**

నీవలన కొరతే లేదు మరి నీరు కొలది తామరపు
ఆవల భాగీరథి దరి వాగుల ఆ జలమే ఊరినయట్లు
శ్రీవేంకటపతి నీవైతే మము చేకొని వున్న దైవ(ము)మని
ఈవలనే నీ శరణని ఎదను, ఇదియే పరతత్త్వము నాకు"

"అన్ని మంత్రములు నిందే ఆవహించెను
వెన్నతో నాకు గలిగె వేంకటేశుమంత్రము
నారదుండు జపియించె నారాయణ మంత్రము
చేరె ప్రహ్లాదుడు నారసింహ మంత్రము
కోరి విభీషణుండు చేకొనె రామ మంత్రము
వేరె నాకు గలిగె వేంకటేశు మంత్రము

రంగగు వాసుదేవ మంత్రము ధ్రువుండు జపియించె
నంగ వించె కృష్ణ మంత్ర మర్జునుండును
ముంగిట విష్ణు మంత్రము మొగి శుకుడు పఠించె
వింగడమై నాకు నబ్బె వేంకటేశు మంత్రము

ఇన్ని మంత్రముల కెల్ల ఇందిరా నాథుండె గురి
పన్నిన దిదియె పరబ్రహ్మ మంత్రము
నన్నుగావ కలిగె బో నాకు గురు డియ్యగాను
వెన్నెల వంటిది శ్రీ వేంకటేశు మంత్రము"

వంటి సంకీర్తనల భావుకత దీనికి దర్పణం పట్టుతుంది.

సకలం హే సఖి జానామి తత్
ప్రకట విలాసం పరమం దధసే
చారు కపోల స్థల కరాంచిత విచారం హే సఖి జానామి
నారాయణ మహీనాయక శయనం శ్రీ రమణాం భావ చిత్తే దధసే

వంటి అన్నమయ్య సంస్కృత సంకీర్తనల్లో అపురూపమైన చిత్రణ ఉంది. ఆయన వేంకటాచల మహాత్మ్యము. సంకీర్తనాలక్షణమును రచించాడు

సంస్కృతంలో రచించిన 'సంకీర్తన లక్షణం' దొరకలేదు.

అన్నమయ్యబహుముఖీనప్రతిభావంతుడు. అన్నమయ్యప్రతిభకుసాహిత్య ప్రపంచందాసోహమనింది. "పదకవితాపితామహుడు". "సంకీర్తనాచార్యుడు", "హరి కీర్తనాచార్యుడు" అని ఆయన పేరు పొందాడు. స్థూలంగా ఆయన రచనలు

ఎ. శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మిక సంకీర్తనలు

బి. శృంగార మంజరి – మంజరీ ద్విపద

సి. శతకములు –పండ్రెండు, ("వేంకటేశ్వరా"మకుటముతో శతకం ఒకటే లభ్యము)

డి. ద్విపద రామాయణము– దొరకలేదు

ఈ. వేంకటాచల మహాత్మ్యము – సంస్కృత రచన, దొరకలేదు

ఎఫ్. సంకీర్తన లక్షణము – లక్షణ గ్రంథము, సంస్కృత రచన, దొరకలేదు

అన్నమాచార్యుల తరువాత పెద తిరుమలాచార్యులు సంకీర్తనల రచనను కొనసాగించాడు. ఆయన అచ్యుత దేవరాయల ఆదరణ పొందాడు. ఆ మహారాజు సహాయంతో సంకీర్తనా భాండాగారవ్యవస్థను ఏర్పాటు చేసి రాగిరేకుల మీద సంకీర్తనల రచన చేయించి భద్ర పరిచాడు.

**తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు**

అన్నమయ్యకు అక్కలాంబకు జన్మించిన వాడు. ఈయన అధ్యాత్మ సంకీర్తనలు, శృంగార సంకీర్తనలు, వైరాగ్యవచన మాలికా గీతాలు., శృంగార వృత్త శతకం, శృంగార దండకం, చక్రవాళ మంజరి, వెంకటేశ్వరోదాహరణం, నీతి సీస శతకం, సుదర్శన రగడ, రేఫ ఱ కార నిర్ణయం, భగద్గీత తెలుగు వచనం, ద్విపద హరివంశం రచించినట్లు తెలుస్తూంది.

అపారమైన ప్రతిభాశాలి అయిన ఈ కవికి చాలా బిరుదాలు ఉన్నాయి. "సంకీర్తనాదికర్త", "శ్రీమద్వేదమార్గప్రతిష్టాపనాచార్య", "శ్రీరామానుజసిద్ధాంత స్థాపనాచార్య", "వేదాంతాచార్య", "కవితార్కికకేసరి", "శరణాగతవజ్రపంజర"

అని ఆయనను గౌరవించారు. ఈ సన్మానాలన్నీ ఆయనలోని పాండిత్యాన్ని చాటుతాయి.

ఈయనకు శ్రీ వేంకటేశ్వర స్వామి ఒక వరం ఇచ్చాడు. త్రిపురుష పర్యంతం ప్రత్యక్షం అవుతానని, సప్త పురుష పర్యంతం మోక్షం ఇస్తానని అన్నాడు. ఇది ఇతడి దైవభక్తిని ప్రకటించే విషయం. స్వామి కైంకర్యాల కోసం ఈయన కావనూరు, మరువకారికుప్పం, కీలంకుంద్రం, మానసముద్రం, పూండి, సంగమకోట, రాయలపాడు, సోమయాజులు పల్లి, కట్టంవారి పల్లి, ఎర్ర గుంటపల్లి, పల్లీపురం, గండితిమ్మాపురం మొదలైన గ్రామాలను సమర్పించి. వీటికి శాసనాలు కూడా వేయించాడు. అంతేకాకుండా, కొంతసొమ్మును కూడా కైంకర్యాల నిమిత్తం సమర్పించాడు.

పెద తిరుమలాచార్యులు మహిమాన్వితుడిగా ప్రసిద్ధుడు. ఒకసారి ఆయన మండెంగ్రామంలో నడుస్తున్నాడు. ఆయనపట్ల వైరం పెంచుకున్నవారు ఉన్నారు. వీరిలో పగబూనిన వాడు ఎవడో ఆయనపై కత్తితో దెబ్బ వేశాడు. అది ఆయనను ఏమీ చేయలేకపోయింది. కత్తి కలువపూల దండగా నిలిచింది. ఇదొక ఐతిహ్యం.

కవిత్వంలో ఆయన నిపుణుడు. పెద తిరుమలాచార్యుల సంకీర్తనల్లో అందమైన ప్రయోగాలు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణకు:

**మేలుకో శృంగార రాయమేటి మదనగోపాల**
**మేలుకోవే నాపాలి మించిన నిధానమా**

**సందడించే గోపికల జవ్వన వనములోన**
**కందువ దిరిగే మదగజమవు**
**యిందుముఖి సత్యభామ హృదయపద్మములోని**
**గంధము మరిగినట్టి గండు తుమ్మెద**

**గతిగూడి రుక్మిణికౌగిట పంజరములో**
**రతిముద్దు గురిసేటి రాచిలుకా**
**సతుల పదారువేల జంట కన్నులఁ గలువలు**
**కితమై పొదిమిన నా యిందు బింబమ**

**వరుస గొలనిలోని వారి చన్నుఁగొండలపై**
**నిరతివాలిన నా నీలమేఘమా**
**శిరసురమున మోచి శ్రీవేంకటాద్రి మీద**
**గరిమ వరాలిచ్చే కల్పతరువా**

ఈ సంకీర్తనలో శృంగారచిత్రణ రమణీయం చేశాడు. గోపికల యవ్వనం ఒకతోట. ఆ తోటలో తిరిగే మదగజం శ్రీ వేంకటేశ్వరుడు. సత్యభామ హృదయం ఒక పద్మం. అందులో మకరందాన్ని మరిగిన గండుతుమ్మెద స్వామి. ఇక్కడ సత్యభామ కూడా ఇందుముఖి అట. చందమామ లాంటి ముఖం కలిగినది. ఈ కీర్తన అంతా అలాంటి అందమైన వర్ణనతో సాగుతుంది.

శ్రీరంగ వైష్ణవ క్షేత్రరాజం. శ్రీ అన్నమయ్య ఆ క్షేత్రాన్ని దర్శించినట్లు లేదు. పెద తిరుమలాచార్యులు ఆ క్షేత్రాన్ని దర్శించాడని ఈ సంకీర్తన ఆకరంగా నిలుస్తుంది.

**బ్రహ్మ పూజించే రఘుపతి విభీషణుకిచ్చె**
**బ్రహ్మణ్యుడీ రంగపతి గొలువరో**

**కావేరీ మధ్య రంగక్షేత్రమల్లదిగో**
**శ్రీ విమాన మదిగో శేష పర్యఙ్కము మిదె**
**దేవుడల్లదే వాడే దేవి శ్రీలక్ష్మి యదె**
**సేవించరో నాభి జగురించే నతడూ**
**(అధ్యాత్మ.15-125)**

శ్రీరంగంలో రంగనాథుని దర్శనం చేసుకున్నాక ఆయన తన తండ్రి పేరిట కొన్ని కీర్తనలను రాగిరేకులపై చెక్కించాడట.

పెద తిరుమలాచార్యుల రచనలలో విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదనలు ఎక్కువ.

**"నీవు లోకేశ్వరుడవు నే మెల్ల నీ బంట్లము"**
**"భోగము నాయందు నీకు భోగివి నీవు"**

"నే నీకు బంటను నీవు నా కేలికవు"
"వేరొక్కరూ లేరు విశ్వమంతా నీ మహిమే
ఏ రీతి నీవే కలవు యితరము లేదు"
"పురుషోత్తమా అన్నిటిలో పూసలలో దారమవూ
వెలివెలిగి నిన్నే పొద్దునను సేవించవలెగాని"
"అదిగాన ఏ యుపాయములు నేనొల్లక
కదిసి నీ శరణనే గతిగంటిని"

ఇత్యాది ఉదాహరణలు ఆ విషయాన్ని స్పష్టం చేస్తాయి.

ఇక ఆయన వైరాగ్య వచనమాలికలు కూడా కవితాత్మక అభివ్యక్తికి ఆకరాలు.

"శ్రీ వెంకటేశ్వర దేవా, నా దేహంబు నీవు ఉండెడి నిత్యా నివాసంబు; నా జ్ఞాన విజ్ఞానంబులు నీ యుభయ పార్శ్వముల దీపంబులు;"

"సీతా వల్లభా, నా కవితా కన్యకు నీవు వరుండవు; దైవ మానుషంబులు గణ పొంతనములు: నా జిహ్వాయే పెండ్లి పీత. నా మనస్సే తెర నా సంతోష కలలే బాసికములు. నా భక్తియే కంకణనంబు. అక్షరంబులే తలంబ్రాలు. శబ్దంబులే వాద్య ఘోషణంబులు."

ఇత్యాది వచనాలు ఆద్యంతమూ కవితాభివ్యక్తితో నిండినవి.

పెద తిరుమలాచార్యుల సుదర్శన రగడ ఒక అందమైన రచన. దీనిలో 59 రగడలు అంటే 108 పాదాలు ఉన్నాయి. మధురగతి రగడలో సాగే ఈ రచన ఆకట్టుకునే గతిలో ఉంది.

ఓంకారాక్షర యుక్తము చక్రము
సాంక మధ్య వలయాంతర చక్రము
శర మత ఖండన చతురము చక్రము
కఠిన పవి నికర కల్పిత చక్రము
ఇత్యాదిగా రచన సాగుతుంది.
చిన తిరుమలాచార్యులు

పెద తిరుమలాచార్యులకు తిరుమలాంబ వలన అయిదుమంది కొడుకులు

పుట్టారు. వారిలో జ్యేష్టుడు చిన తిరుమలాచార్యులు. ఈయనకు 'చారు తర అష్ట భాషా చక్రవర్తి' అని బిరుదు ఉంది. యితడు అన్నమయ్యకు ముద్దుల మనవడు. ఇతడికి అన్నమయ్య బ్రహ్మోపదేశం చేశాడు.

"అప్పని వరప్రసాది అన్నమయ్య
అప్పనము మాకే కలడన్నమయ్య"

"గురుడవు నీవే సుమ్మీ కుమతినైననాకు
సరవిబ్రహ్మోపదేశము సేసితి"

అని సంకీర్తించినాడు. సంస్కృతమూ, ఆంధ్రమూ రెండు భాషలలోనూ గొప్పకవి. ఎనిమిది భాషల మీద పట్టు ఉన్న వ్యక్తి. అంతటి ప్రతిభ ఉన్నా కూడా రాజుల ఆశ్రయం కోసం ఆరాటపడలేదు.

"వెలయు రాజులను దీవించే ప్రాణులాల
కల శ్రీవెంకటనాటు గానగ రాదా
వలెనని ఇందరికి వరాలిచ్చే దేవుడేమి
కొలువు నిలువుపాటి గుణమియ్యనోపడా"

"ఎందు వంకనో ఈ దేహి ఏమిటినో పొగడుచు
విందువలె నెవ్వరిని వెర్రిజేసేది
కందువైన శ్రీ వెంకట నాథుడు గావఁగా
సందుసుడి కోరికల సటబడ జెల్లునా"

వంటి సంకీర్తనలలో రాజుల పట్ల ఒక ఉదాసీనత కనిపిస్తుంది. ఆయన సంపదల కోసం, రాజసన్మానాల కోసం ఆశ పడలేదు.

శ్రీ కళ్యాణ వెంకటేశ్వర స్వామి ఆలయం జీర్ణావస్థలో ఉండగా దానిని ఉద్ధరించాడు ఈయన. అక్కడ అన్నమయ్య విగ్రహాన్ని కూడా ప్రతిష్ఠించాడు. అనేక ప్రాంతాలు తిరిగిన వ్యక్తి ఈయన. చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు వంటి ప్రాంతాలలో పర్యటించాడు. మంగళగిరి ఆలయంలో సంకీర్తన అరుళప్పాడును ఏర్పాటు చేశాడు. క్రీ.శ 1562 వరకు జీవించాడు.

## చిన్నన్న

తాళ్ళపాక తిరువేంగళనాథుడు. పెద తిరుమలాచార్యుని అయిదు మంది కొడుకులలో ఇతడు నాలుగవవాడు. రాయలు రాజ్యం చేసేనాటికి ఇతడు 30ఏళ్లవాడు అయి ఉంటాడు. అచ్యుత రాయలు, సదాశివ రాయలు ఇతడిని ఆదరించారు. సన్మానాలు చేశారు క్రీ.శ. 1545లో సదాశివ రాయలు ఇతడిని సత్కరించి అద్దంకిలో ఉండే మల్లవరం గ్రామాన్ని దానం చేశాడు. దానిని 1546లో యితడు శ్రీవెంకటేశ్వర స్వామికి ఆ గ్రామాన్ని సమర్పించుకున్నాడు. "చిన్నన్న ద్విపద కెరుగును" అని ప్రశస్తి పొందాడు. "అన్నమాచార్య చరిత్రను" ద్విపదలో రచించాడు. "జలజాతవాసిని చను బాల పుష్టితో" ఎదిగినట్లు చెప్పుకున్నాడు. "దినములోనే వేయి ద్విపదలింపొంద వినుత వర్ణనలతో విరచించు" వాడిగా ప్రసిద్ధి పొందాడు. పరమయోగి విలాసం ఇతడి ప్రసిద్ధ రచన....

## తిరువేంగళప్ప

ఇతడు చిన తిరుమలాచార్యుని కొడుకు. కవి. సంస్కృతంలో ఉన్న అమరుక కావ్యాన్ని ఆంధ్రంలోకి అనువాదం చేశాడు. వివరణ కూడా రచించాడు. నామలింగాను శాసనం గ్రంధానికి. కావ్య ప్రకాశికకు వ్యాఖ్యానం వ్రాశాడు. గోవింద రాజ స్వామి ఆలయానికి, కంచి అరుళాళప్పెరుమాలకు భూదానాలు చేశాడు.

## అన్నయ్య

కోనేటి అన్నమయ్యంగారు అని ఈయనకు పేరు. చిన తిరుమలాచార్యులకు ఇతడు తమ్ముడు. పెద తిరుమలాచార్యులకు రెండవ కొడుకు. తిరుమల కోనేటి వద్ద స్థిర నివాసం ఉండడంతో కోనేటి అన్నమయ్యంగారు అని అంటారు. తిరుపతిని కేంద్రంగా చేసుకుని వైష్ణవ మతాన్ని బోధించారు. ఈ కోనేటి అన్నమయ్య కుటుంబం గుంటూరు మండలం వెళ్ళారు. కొండవీడు దుర్గానికి చెందిన వినుకొండ సీమ మిన్నికల్లు గ్రామాన్ని (గుంటూరు జిల్లా, నరసారావు పేట తాలూకా) సదాశివరాయలు క్రీ.శ 15-5-1546లో ఈ అన్నమయ్యంగారికి దానం చేసినట్లు శాసనం ఉందని చెప్తారు.

అలాగే ఆ రాజు ఆలూరిలోని "తుండువము" అనే గ్రామాన్ని దానం చేశాడట. ఇతని తమ్ముడు కొనేటి తిరువెంగలనాయుడు గుంటూరు మండలంలో ఉండేవాడు ఇతడిని గురించి "అన్ని విద్యలయందు నరయ

మున్నింటి అన్నయారుని బోలు నన్నయాచార్యుడ"ని

## తాళ్ళపాక తిమ్మక్క

తిమ్మక్క అన్నమాచార్యులకు మొదటి భార్య. సుభద్రా కళ్యాణం అనే కావ్యాన్ని మంజరీ ద్విపదలో రచించింది ఇది శృంగార రస ప్రధాన రచన. లభించినంత వరకు ఆమె తొలి తెలుగు కవయిత్రి. తెలుగు పలుకు బడులను బాగా ప్రయోగించగలదు ఈమె. సుభద్రా కళ్యాణం అనే రచన రూపంలో చిన్నదైనప్పటికీ మంచి కవిత్వం ఉంది. ఇందులోని తెలుగు మాటలు, జాతీయాలు కొన్ని విజయ విలాసంలో కనిపిస్తాయని అంటారు.

**క్రమమున క్రీడి గంగానది జేరె**
**కమలార్కుడుదయించు కాలంబునందు**
**తనవెంట వచ్చిన ధారుణీసురుల**
**గనుఁగొని యర్పించి కథలెల్ల జెప్పె**
**అర్థముల ధేను సమస్రముల్ గాను**
**ఆర్తితోభూసురులకమరకంబొసఁగె**
**ఇది ఆమె రచనకు ఒక మచ్చుతునక**

రేవణూరి కొండయార్యుడు

ఈయన అన్నమాచార్యుని అల్లుడు. కర్నూలు జిల్లా కోయిలకుంట్ల తాలూకా రేవణూరులో ఉండేవాడు ఇతని రచన

రామచంద్రోపాఖ్యానము (ప్రబంధము)
రేవణూరి వేంకటాచార్యుడు

ఈయన అన్నమాచార్యుని మనవడు, అంటే కూతురు కొడుకు. తిరుమలాంబ, తిరుమల కొండయార్యుల తనయుడు.

ఇతని రచనలు

★ శకుంతలా పరిణయము – ప్రబంధము

★ శ్రీపాదరేణు మహాత్మ్యము – కావ్యము

తరతరాలుగా సాహిత్య జీవనదిని ప్రవహింప జేసిన ప్రతిభావంతులు తాళ్ళపాక కవులు. తెలుగు సాహిత్యరంగం పై పదకవితా సరస్వతి పాద నూపురాలను నిరంతరం పలికించిన ధన్యులు వీరు.

# తెలుగు వాగ్గేయకారులు సంగీతమునకు చేసిన సేవ



ఆచార్య చల్లా ప్రభావతి
✆ 94410 46448



మన దేశం సాంస్కృతీ, సంప్రదాయాలకు నిలయం. పేదగని, సాంఘీక ఆచారాలకు ప్రతీక. అట్టి ఈ గడ్డన పుట్టిన ఎందరో మహానుభావులు మనవంటి సామాన్యులకు గనన కుసుమం వంటి విషయాలను కూడా అవలీలగా అవగాహన చేసుకొనే విధంగా పురాణాల, గ్రంథాల, కీర్తనల, పాటల రూపాలలో సకల విషయాలను నిక్షిప్తం చేశారు. పుస్తకాలు చదివి విజ్ఞానాన్ని సంపాదించుకోగల విద్యావంతులు ధన్యులు. అక్షర జ్ఞానం లేని ఆనాటి అబలలు కూడా ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, శ్రీ త్యాగరాజ స్వామివారి ఉత్సవ సాంప్రదాయ కీర్తనలు యక్షగానాలు మొదలైనవి పాడేవారు.

ప్రస్తుతం మనం తెలుగు వాగ్గేయకారులు సంగీతానికి చేసిన సేవ అన్న

విషయమై నాకు తెలిసిన కొద్ది విషయాలను మననం చేసికొందాం.

అసలు వాగ్గేయకారుడు అంటే ఎవరు? రచనా శక్తి ఉన్నవారు రచిస్తారు. దానిని గానం చేయాలంటే మరో సంగీతజ్ఞులు కావాలి అలా కాకుండా రచించిన వారే గానం చేయగల సామర్థ్యం ఉండి సంగీతం కూర్చగల్గినప్పుడు వాక్కు, గేయం రెండూ ఒకరివైనప్పుడు వారు వాగ్గేయ కారులౌతారు. అలా వాగ్గేయకారులలో పన్నెండు నుండి దాదపు పదిహేడవ శతాబ్దాల వరకు అన్నమాచార్యుల వారి క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి మున్నగు వారు రచనలు సాగించగా, పద్దెనిమిదవ శతాబ్దం నుండి సంగీత త్రిమూర్తులు, శ్రీ త్యాగరాజస్వామి, శ్యామశాస్త్రుల వారు, శ్రీముత్తు స్వామి దీక్షితుల వారు, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, మైసూరు వాసుదేవాచార్యుల వారు, తదితరులు వెలిశారు. మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు కూడా ఎనో రచనలు రచించి గానం చేయడం మనకందరికీ తెలుసు.

మొదట మనం పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యులు అయిన శ్రీ అన్నమయ్య వారి గూర్చి ఒకింత పరిశీలిద్దాం. వీరు 32వేల సంకీర్తనలు రచించారు. వీరి సంకీర్తనలు రాగి రేకులలో రాగాల పేర్లతో ముద్రించి రచింపబడ్డాయి. అవి ప్రాచీనకాలం నాటి కైశికి ద్వాదశి, అర్ధదేశి వంటి రాగాలలో పేర్కొనబడ్డాయి. కానీ ఆ కాలం నాటి జనులు, జానపదులు పాడుకొనే విధంగా లాలిపాటలు, గొబ్బిళ్ళ పాటలు, పెళ్ళిపాటలు, దంపుడు పాటలు, ఇంకా ఆధ్యాత్మికంగా కూడా సంకీర్తనలున్నాయి. అవి అన్నీ ప్రచారంలో ఉన్నా కూడా నేటికీ ఇంకా సంగీతజ్ఞులు ఎవరి బాణీలో వారు రాగం కూర్చి పాడడం, వాటిని తిరుమల తిరుపతి దేవస్థానం వారు సి.డి రూపంలో ఆవిష్కరించడం జరుగుతూంది. ఈ నేపథ్యంలో నా సంగీత



కుర్చులో కూడా సి.డిల ఆవిష్కరణ జరిగిందని చెప్పడానికి ఆనందిస్తున్నాను.

ఇక్కడ మనం ముఖ్యంగా గమనించవలసింది అన్నమయ్య వారి సంకీర్తనలు నేటికీ బహుళ ప్రచారంలో ఉండడమే కాక కొత్తదనం కోసం శ్రీ గరిమెళ్ళ బాలకృష్ణ ప్రసాద్ గారు అనేక నూతన రాగాలను సృష్టించి వాటిల్లో ఈ సంకీర్తనలను పొందుపరచటం జరిగింది. ఇందుమూలంగా సంగీతపరంగా "అనంతాశ్చరాగాః" అన్నమాటకు ధీటుగా సంగీత ప్రపంచంలో ఎన్నో కొత్తరాగాలు పరిచయమయ్యాయి. అన్నమయ్య సంగీతం అనగానే అందరికీ అందుబాటులో ఉన్నటువంటిది అన్న భావన అందరిలో నాటుకుపోయింది. వారి సేవ సంగీతంతో పాటు సమాజానికి కూడా ఉపయోగపడింది.

అన్నమయ్య వారి కీర్తనలలో శృంగార రసభరితములే కాక ఆధ్యాత్మిక తత్త్వమును వేదాంత తత్వమును కల్గిన కీర్తనలు కూడా కలవు. నేడు అందరికీ సుపరితములైన "అదివో అల్లదివో", "కొండలలో నెలకొన్న" వంటి కీర్తనలే కాక ఇటీవల తిరుమల తిరుపతి దేవస్థానం వారు వెలికి తీస్తున్న సి.డిలలోని ఒక కీర్తన మచ్చుకి.

**"పుట్టించేవాడవు నీవే**
**పోరులు పెట్టేవు నీవే**
**ఎట్టు? నేరుచుకొంటి విదినీ వినోదమా? వినోదమా?**
**కొందరు రాక్షసులును, కొందరు దేవతలును**
**అందరికంతర్యామివి ఎప్పుడు నీవు**
**అందికోపమొకరికి అట్టే ప్రసాదమొకరికి**
**ఇందులోన పక్షపాతమిది నీకే తెలుసును?"**

2. ఇక మహాకవి క్షేత్రయ్య. వీరి పదాలు పరిచయం కాని మానవుడుండడు. వీరు పేరు వినగానే క్షేత్రయ్య పదం అని వెంటనే అంటాం. పద్యం కన్నా ముందే పదం ఆవిర్భవించింది. అన్నమయ్యను పదకవితా పితామహుడు అన్నాం అంటే ఆయన సంకీర్తనలను పదాలన్నాం కానీ ఆ పదాలకి రాగతాళ యుక్తంగా గనుక వరికలతో పాడుకునే విధంగా పదాలకి శ్రీకారం చుట్టిన మహావ్యక్తి ఈ క్షేత్రయ్య. అన్నమయ్య శృంగార సంకీర్తనలకు ప్రభావితుడై మధుర భక్తి శృంగార రచనలను చేశాడు. ఈ పదాలు నృత్యానికి కూడా



అభినయానికి అనుగుణంగా ఉంటాయి. ఎక్కువ చాపు తాళాలనే వినియోగించారు. మువ్వ గ్రామంలోని కృష్ణుని నామ "మువ్వ గోపాల" అనేదే వీరి ముద్ర. కాంభోజి, కళ్యాణి, సావేరి, శహన వంటి రాగాలలో పదాలు ఎక్కువ ప్రసిద్ధి చెందాయి. పదాలు పాడడంలో దిట్ట అయిన శ్రీమతి బృంద గారిని తెలియని వారుండరు.

3. భక్త రామదాసు మన మనులను తన దాసోహం చేసికొన్న పరమ భక్తాగ్రేసరుడు. దాశరధీ శతకంలోని పద్యం తెలియని తెలుగువాడుండడు అంటే అతిశయోక్తి కాదు. రామదాసు కీర్తనలు భజన కీర్తనలుగానూ, కర్ణాటక సంగీత శాస్త్రజ్ఞానం లేని పామరులు సైతము హాయిగా మనఃస్ఫూర్తిగా మనోల్లాసానికి పాడుకునే సరళ భాషతోనూ కూడి ఉన్నాయి. ముఖ్యంగా ప్రముఖ విద్వాంసులు, పద్మ విభూషణ్ శ్రీమంగళంపల్లి బాలమురళీ కృష్ణగారి నోట భద్రాచల రామదాసు కీర్తనలు విని తీరవలసినదే. మంచి కళ్యాణి, దన్యాసి, కాంభోజి, వరాళి వంటి రాగాలలో వారు మన మధ్య లేకున్నా, మనందరి మనసుల్లో రామదాసు కీర్తన అనగానే మెదిలేది వారి కంఠస్వరమే. తదుపరి ఇటీవలి కాలంలో కీ.శే. శ్రీ. నేదునూరి కృష్ణమూర్తిగారు కూడా స్వరపరచి, భద్రాచలంలో ఏటా ఉత్సవాలు జరిపినపుడు ఆ కృతులు మనం వినడం జరుగుతూనే ఉంది. మొత్తంపై సంగీతం అనేది భక్తి



మార్గంలో పయనించే బాటసారికి మోక్షమార్గాన్ని సూచిస్తూ చేయూతనిచ్చే సాధనం అన్న విషయం మనమందరము అంగీకరించవలసినదే. రామదాసుగారి ప్రభావం మున్ముందు త్యాగరాజస్వామి వారి పైన చాలా ఉందని మనం ఘంటాపథంగా చెప్పవచ్చు.



4. ఇక సంగీత త్రిమూర్తులలోని వారైన శ్రీ త్యాగరాజస్వామి వారి గూర్చి చర్చించడమనేది ఈ వ్యాసంలోని ముఖ్యమైన ప్రసిద్ధఘట్టమని చెప్పవచ్చు. ఎందుకంటే సుమారు ఆరు శతాబ్దాల వెనకటి వ్యక్తి. నేటికీ అందరి హృదయాల్లో నెలవై ఉండడం ఏ చిన్న ఊర్లోనైనా "త్యాగరాజు ఉత్సవం" అనేది జరగకుండా ఉండదు. సంగీతం అనేది స్వరం లేకుండా ఎలా ఉండదో అలానే సంగీతజ్ఞుడు అంటే తప్పని సరిగా త్యాగరాజస్వామి కీర్తన తెలియని వ్యక్తి ఉండదు. ఏ ఒక్క వాగ్గేయ కారుడి పేరైనా ఏ ఒక్కరికో తెలియకపోయి ఉండచ్చు కానీ త్యాగరాజస్వామి వారి రచన లేని సంగీతం కానీ కచేరీ కానీ ఉండదు. వీరి కీర్తనలు కేవలం భక్తి రస ప్రధానాలే కాక సామాజిక, నైతిక విలువలను బోధించేవిగా ఉంటాయి. త్యాగరాజస్వామి రామ భక్తుడు, రాముని సేవించాడు, కీర్తించాడు, పూజించాడు, భజించాడు, నిందాస్తుతి కూడా చేశాడు.

కేవలము పుట్టుక చేతకాక గుణము చేత బ్రాహ్మణత్వము ఉండాలని "వేగలేచి నీటమునిగి భూతిపూసి" నంత మాత్రాన వెలికి శ్లాఘునీయులై ఉండిన చాలదు అని నొక్కి వక్కాణించారు. (ధేనుక రాగం.... "తెలీయలేరు") త్యాగరాజస్వామి వారి రచనలోని శైలి మనసుకు హత్తుకునే విధంగా ఉంటుంది. పల్లవిలో మనని పలకరించి అనుపల్లవిలో ఆ భావాన్ని సుస్థిరత్వము చేసి చరణంలో వివరిస్తారు. పల్లవి మధ్య స్థాయిలో ఉండి అనుపల్లవి

తారస్థాయిలోను, చరణం యొక్క పూర్వాంగం పల్లవికి దగ్గరగా ఉండి మరల ఉత్తరాంగం అనుపల్లవిలాగే ఉంటుంది. సంగతులనేవి శ్రీ త్యాగయ్య గారి కీర్తనల ద్వారానే జనుల ఆమోదానికి దగ్గరయ్యాలని చెప్పచ్చు. వీరి కృతులు ఒక రాగంలో పది ఉంటే ఆ పది దేనికదే. ఒకే రాగం, కాని పంథా వేరే. అది త్యాగయ్య గారి ప్రత్యేకత. ఒక రాగంలో చాలా కీర్తనలు రచించి జనుల రాగ ప్రసార జ్ఞానాన్ని ఇనుమడింపచేశారు. వీరి కీర్తనలనే మిక్కుటంగా సాధన చేస్తే రాగాలాపన దానంతటదేవస్తుంది. ఒక కీర్తన తీసికొని చిన్న చిన్న భాగాలలో రాగంగా ఆలపించడానికి పూనుకుంటే రాగాలాపన్ పరిపూర్ణమౌతుంది. అనేక ప్రసిద్ధ రాగాలు, మెళకర్త రాగాలు, జన్య, భాషాంగరాలు వీరి కీర్తనలలో చోటు చేసుకున్నాయి. ఆర్తిగల అభేరి, హిందోళం, ఖరహర ప్రియ, షణ్ముఖప్రియ తోడి వంటి రాగాలలో కీర్తనలు శ్రోతలను మైమరపించి రస సిద్ధిని కల్గిస్తాయి. వీరి కీర్తనలు మనోధర్మమునకు చెందినట్లుగాను, విడిగాను పాడుకొనుటకు రెండు రకాలుగాను వీలుగాఉంటాయి. వీరు సంగీత ప్రాధాన్యత కల్గిన రచనలు, సాహిత్య ప్రాధాన్యత కల్గిన రచనలు కూడా చేశారు భజన సంప్రదాయకంగాను, భక్తి పూర్వకంగా పాడుకునే ఉత్సవ సాంప్రదాయ కీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు వంటివి కూడా ఉన్నాయి. అలాగే ఒక శాస్త్రజ్ఞాన పూర్వక కచేరీలో ముఖ్యాంశంగా పాడదగినట్లుగా మెరవి స్వర కల్పన, రాగాల పనలకు వీలుగానున్న రచనలు ఉన్నాయి. త్యాగరాజస్వామి శైవ, వైష్ణవ బేధము లేదని చాలా చక్కగా.

"ఎవరని నిర్ణయించిరతిరా?" అన్న కీర్తనలో శివమంత్రమునకు "మ" జీవము, మాధవి మంత్రమునకు :"రా" జీవము అని తెల్పి

రీతిగౌళరాగ కృతిలో "ద్వైతము సుఖమా?" అని

అద్వైతము సుఖమా? ప్రశ్నించి "చైతన్యమా వినుము సర్వసాక్షి విస్తారముగా తెలుపుమా నాతో" అని తనకు తానే సర్ది చెప్పుకొన్నారు.

వీరి శైలి అటు శుద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులకు, శాస్త్రజ్ఞానము లేని సామాన్య మానవపులకు, ఇరుపక్షాల వారికీ అందుబాటులో ఉంటుంది.

**"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాస్తనద్వయం**
**ఏకమా పాత మధురం అన్యదాలోచనామృతం"**

అన్న మహాకవి కాళిదాసుగారి భావానికి చాలా దగ్గరగా వీరి కీర్తనలు విన్నంతనే జనుల హృదయాలలోకి చొచ్చుకుపోయి సంగీత, సాహితీ భావాలు రెంటితోనూ అలరిస్తాయి. ఒక రాగం ఎలా పాడాలి? అన్న ప్రశ్న వస్తే ఏదైనా త్యాగరాజస్వామి వారి కీర్తన చూస్తే ఆ క్రమం అర్థమైపోతుంది వీరు నిందాస్తుతిలో రామునితో పరాచికాలాడుతు ఎకసెక్కములాడారు, నిష్ఠూరమాడారు.

సముదాయకృతులు – ఘనరాగాపంచరత్నాలు, నారద పంచరత్నాలు, తాల్లుడి పంచరత్నాలు, కొవ్వూరి సుందరేశ కృతులు వంటివి ఎన్నో సామూహికంగా కలిసి గానం చేసే విధంగా రచించారు.

కృతిలో "సంగతి" అనేది ముఖ్యంగా మనం శ్రీ త్యాగరాజస్వామి వారి కృతులలోనే చూస్తాము.

పైవిధంగా సద్గురు శ్రీ త్యాగరాజస్వామి వారు మన తెలుగునాటనే కాక ప్రపంచమంతా వేనోళ్ల పొగడదగినట్టుగా సంగీత సేవ చేసి తరించారు.

5. త్రిమూర్తులలో ఒకరైన శ్రీ శ్యామశాస్త్రులవారు కామాక్షి అమ్మవారు పైన ప్రీతితో భక్తితో రచనలు గావించి సంగీత లోకాన ఒక ప్రత్యేక విశిష్టతను సంతరించుకున్నారు. వీరికి ఆనందభైరవి రాగమన్న మక్కువ ఎక్కువని తెలుస్తుంది. వీరు లయపైన ఎక్కువ దృష్టి సారించినట్లుగాను ఎక్కువగా చాపు తాళ్ళలోనే రచనలు గావించారని, అందునా విలోమ చాపు వీరి రచనలలో కనుపించి సంగీతజ్ఞుల మేధస్సునికి గీటు రాయి అనిపించేలా ఆ రచనలు సాగాయని ఎల్లరకును విధితమే. సాక్షాత్తు సోదరులాయన ఐదు అక్షరాల పదాలు వీరి రచనలలో మనము ఎక్కువగా గమనిస్తాం.

**ఉదా : అనుదినము అపరిమిత**
**గజగమన దొరయనుచు**
**కమలముఖి కనకగిరి**
**గిరితనయ మహిమవిని**

**వరమొసగు కృపసలుపు**
**మొరలిడగ పదయుగమె**
**కమలదళ కమలభవ**
**సమయమిది గతియనుచు**

ఇవి అన్నీ కూడా "తకతకిట" అను జతికి

**పొగడుటకు సరిపోలినట్లుండుట గమనార్హము**
**బిరుదుగల ఆనందభైరవి వీరి సొత్తుగా భావించవచ్చు.**

పై విధంగా సాహితీ సంగీత విలువలు గల శ్రీ శ్యామశాస్త్రుల వారి రచనలలోని అందము వర్ణింప వీలుకానిది.

6. త్రిమూర్తులలో చిన్నవారైన శ్రీముత్తుస్వామి దీక్షితులు వారు సుబ్రమణ్యేశ్వర భక్తులు వారి రచనలనీ సంస్కృతములోనే సాగినవి నారి కేళపాకమనదగిన సాహిత్యం వీరిది. సంప్రదాయ బద్దంగా జరుపుకొనే ప్రతి విషయాన్ని సమగ్రంగా రచనలలో పొందుపరిచారు.

**ఉదా: "సిద్ధివినాయకం" షణ్ముఖ ప్రియ కృతిలో**
**"భాద్రపదమాసచరుతుర్థ్యాం" అని పేర్కొన్నారు.**
**"శ్రీ వరలక్ష్మి" అన్న శ్రీరాగ కృతిలో.**

"శ్రావణపౌర్ణిమ పూర్వస్థ శుక్రవారే" అని ఆ ప్రాముఖ్యతను వెల్లడిచేశారు. వీరు గుచ్ఛకృతులు – కమలాంబాజానవావర్ణకృతులు, నీలోత్పలాంబావనా వర్ణములు, నవగ్రహకీర్తనలు, షోడశ గణపతి కృతులు, పంచలింగ స్థల కృతులు, ఇలా ఎన్నో సంక్లిష్ట విషయాలను కృతుల ద్వారా భారతీయుల సంస్కృతి, సదాచారాలను ప్రస్ఫుటింపచేశారు. మొత్తం పై త్రిమూర్తుల సేవ సంగీతంలో ఉచ్ఛస్థితిలో నున్నదని చెప్పడం అతిశయోక్తి కాదు.

7. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్. వీరి ముద్ర "వరద వెంకటేశ" ఆ ముద్ర వచ్చేవరకూ మనం త్యాగయ్యవారి రచనే అనుకుంటాం. అంత పోలిక ఉంటుంది వీరిరువురి రచనలలో. పల్లవి ఎత్తుగడ, అనుపల్లవి మరల తార స్థాయిలో ఉండడం, మళ్ళీ చరణం పూర్వాంగం అనుపల్లవి వలె ఉండడం ఇవన్నీ కాక, ఆ పోకడలన్నీ త్యాగయ్య గారికీ వీరికీ ఒకేలా స్ఫూరించడం చాలా ఆశ్చర్యకరం.

వీరు కూడా దాదాపు ముఖ్యమైన కాంభోజి, షణ్ముఖ ప్రియ, లతాంగి వంటి సుప్రసిద్ధ రాగాలలో రచనలు చేసి యున్నారు. బేగడ రాగంలో "అనుదినమును కావుమయ్య అంటూ ఆ వేంకటనాధుని వేడుకొనని విధానము అద్భుతం.

8. మైసూరు వాసుదేవాచార్యులు – వీరి రచనలు చాలా ముచ్చటగా ఆపద సమూహపు భావం, దానికి తగ్గ సంగీతం పండిత పామలను సైతం ఆకట్టుకోగలదు. మోహన, రంజని, నాటకురంజి, శహన, తోడివంటి రాగాలలో రచనలు చేయడమే కాక, ఇంచుమించు చాల కృతులకు చిట్ట స్వరములు చేసియున్నారు.

పై విధంగా మన తెలుగునాట వాగ్గేయకారులు సంగీతానికి చేసిన సేవ అపారమైనదన్న విషయాన్ని అందరితో పంచుకోవడం "ఏనాటి నోము ఫలమో!"

అంతటికి ఏలికైన ఆదినారాయణు తన
అంతరంగాన నిలిపి అన్నమయ్య
సంతసాన చెలువొంది సనకసనందనాదు
లంతటివాడు తాళ్ళపాక అన్నమయ్య!!

బిరుదు టెక్కెములుగా పెక్కు సంకీర్తనములు
హరిమీద విన్నవించె అన్నమయ్య
విరివిగలిగినట్టి వేదముల అర్థమెల్ల
అరసి తెలిపినాడు అన్నమయ్య!!

– చినతిరుమలయ్య

# అన్నమయ్య సాహిత్యం- సామాజికదృక్పథం



ఆచార్య దార్ల వెంకటేశ్వరరావు
✆ 91826 85231

"అన్నమయ్య"గా ప్రసిద్ధిపొందిన తాళ్ళపాక అన్నమాచార్యుల (1408-1503) గురించి ఎక్కడ జాతీయ సదస్సులు జరిగినా, ఆ సదస్సు లక్ష్యమేదైనా ఒక సంకీర్తనను మాత్రం ప్రస్తావిస్తుంటారు. అదే "బ్రహ్మమొకటే... పరబ్రహ్మమొకటే..." అనే సంకీర్తన. అన్నమయ్య 32వేల కీర్తనలు రాసినట్లు వాళ్ళ మనమడు తాళ్ళపాక చిన్నన్న రాసిన "అన్నమాచార్య చరిత్రము" చెప్తున్నా, దొరికినవి మాత్రం 14,238 అని ఆ రంగంలో కృషి చేసిన పండితుల అభిప్రాయం.[1] వాటిలోను పరిశోధకులు, విమర్శకులు పట్టించుకొనేవి వందల్లోనే ఉంటాయనీ, వాటికి సంగీతాన్ని స్వరపరచడం ద్వారా ప్రజల్లోకొచ్చినవి వాటిలో మరోసగం ఉండవచ్చేమోనని అన్నమయ్య సాహిత్యాన్నీ, సంగీతాన్నీ పరిశీలిస్తున్నవారి అభిప్రాయం.[2]



ఎవరెన్ని అభిప్రాయాల్ని వ్యక్తం చేసినా అన్నమయ్య సమకాలీన సమాజాన్ని వదిలేసి తన సంకీర్తనల్ని రాయలేదనేది ఆయన సాహిత్యంలో ప్రతిఫలించే సామాజిక వస్తు దృక్పథాన్ని చూసే వారి అభిప్రాయం.[3] వీళ్ళందరిలోను చర్చలోకి వచ్చేది ప్రధానంగా ఈ సంకీర్తనే. దీనికి కారణం ఈ సంకీర్తనలో దేవుడి దృష్టిలో బ్రాహ్మణుడు నడిచేదీ, చండాలుడు జీవించేది మాత్రమే కాకుండా సర్వజీవులకు శ్రీహరే అంతరాత్మ అనే భావన వ్యక్తం కావడం ఒక ప్రధాన కారణంగా చెప్పుకోవాలి.

బహుశా ఇటువంటి కీర్తనల ఆధారంగానే చలనచిత్ర నిర్మాతలు అన్నమయ్య దృష్టిలో కులం లేదనే భావనకల్గించేలా సినిమాల్ని తీశారు. ముఖ్యంగా కె.రాఘవేంద్రరావు దర్శకత్వంలో నాగార్జున 'అన్నమయ్య'గా నటించిన సినిమాలో దళితుల దేవాలయ ప్రవేశ సన్నివేశాన్ని చక్కని దృశ్యకావ్యంగా మలిచి, సామాన్య ప్రజల్లో కూడా అన్నమయ్య కులాలకు అతీతుడనే భావనను కలిగించగలిగారు. గుడిలోకి ప్రవేశిస్తున్న దళితుల్ని పూజారులు అడ్డుకుంటుంటే, అన్నమయ్య దళితులకు అండగా ఉన్నట్లు, అందుకనే ఆ కీర్తనల్ని బ్రాహ్మణులే తగలబెట్టినట్లు చిత్రీకరించారు. దీనివల్ల కుల నిరసనతో మరిన్ని కీర్తనలున్నాయనే అభిప్రాయం కలుగుతుంది. రాస్తే, మంచిదే.కానీ, తిరుపతి కొండమీదకి దళితులు దేవాలయ ప్రవేశం కోసం 1947లో ప్రయత్నించినా అడ్డుకున్నారనేది చరిత్రలో కనిపించే అంశం.[4] అలాంటప్పుడు దళితులు శ్రీవేంకటేశ్వరస్వామిని అన్నమయ్య కాలంలోనే దర్శించుకున్నారనేది, దానికి అన్నమయ్య అండగా నిలిచాడనేది ఎంతవరకు నమ్మశక్యమో ఆలోచించుకోవలసిందే! ఈ నేపథ్యంతో అన్నమయ్యను పరిశీలించడం అవసరం.ఒకవైపు పరిశోధకులు, విమర్శకులు మరోవైపు సినిమాల వల్ల అన్నమయ్య రాసిన అన్నివేల సంకీర్తనల కన్నా, ఒకటి రెండు సంకీర్తనలే ప్రాచుర్యంలోకి వచ్చాయి కానీ, మిగిలిన సంకీర్తనల్ని కూడా జాగ్రత్తగా పరిశీలిస్తే ఇంకా చాలా చోట్ల అన్నమయ్య చేసిన కులప్రస్తావన కనిపిస్తుంది. ఇక్కడో ప్రశ్న వస్తుంది. ఆధ్యాత్మికవాదైన అన్నమయ్యను కులదృష్టితో చూడొచ్చా?

భారతీయసమాజం చాతుర్వర్ణ వ్యవస్థను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాటించినందువల్ల ప్రతీకవినీ ఈ కులదృష్టితో పరిశీలించడానికి అవకాశమేకాదు, అవసరం కూడా ఉంది. ఇలా పరిశీలించడం వల్ల వాళ్ళ పరిమితుల్ని, కులం పట్ల వాళ్ళ తాత్త్వికతనీ గుర్తించడానికి వీలవుతుంది. లేకపోతే ఏదో సందర్భంలో అలవోకగా చెప్పినవాటిని సీరియస్‌గా తీసుకొని వాళ్ళనో కులనిర్మూలన ఉద్యకారులుగా కీర్తించేవాళ్ళు బయలుదేరే ప్రమాదముంది.అటువంటప్పుడు అది చారిత్రకవక్రీకరణ అవుతుంది. దీన్ని సాహితీమేధావులు వివరించాల్సిన అవసరం ఉంది.



ఇప్పటికే అంబేడ్కర్, జోతీరావుబాఫూలే, ఇ.వి.రామస్వామి నాయకర్ వంటి వాళ్ళతోను, ఒకోసారి వాళ్ళను మించి కూడా ఆ తాత్త్వికత చింతన పట్ల అవగాహన లేక కొంతమందీ, తెలిసి కూడా చారిత్రక వక్రీకరణలో భాగంగా మరికొంతమందీ గాంధీజీ 'హరిజనోద్ధరణ'ను ప్రచారం చేస్తున్నారు. ఈ పరిమితులతోనే అన్నమయ్య సాహిత్యాన్ని కూడా దళితులు అవగాహన చేసుకోవాలి. అందువల్ల అన్నమయ్య సాహిత్యాన్నీ కులదృష్టితో పరిశీలించడం తప్పుకాదనుకుంటున్నాను.

క్రీస్తు శకం 15, 16 వ శతాబ్దాల్లో భారతదేశంలో భక్తి ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసి పడుతున్న కాలంలో అన్నమయ్య జన్మించాడు. దీన్నింకా స్పష్టంగా వివరించుకోవాలంటే 09-05-1408 (సర్వధారి సంవత్సరం, వైశాఖశుద్ధపూర్ణిమ) లో సనాతన సంప్రదాయ బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడు. ఈయన సుమారు 95 సంవత్సరాలు పాటు జీవించి, అనగా 23-2-1503లో మరణించాడు. కేవలం సంకీర్తనలు మాత్రమే కాకుండా సుమారు 12 శతకాలు రాసినట్లు వాటిలో ప్రస్తుతం శ్రీవేంకటేశ్వరశతకం మాత్రమే లభించిందంటున్నారు. వీటితో పాటు మంజరీ ద్విపదలో

“శృంగారమంజరి”, “ద్విపదరామాయణమ్”,“వేంకటాచల మాహాత్మ్యమ్”, సంస్కృతంలో “సంకీర్తనాలక్షణమ్” మొదలైన రచనలు చేసినట్లు తెలుస్తుంది. వీటన్నింటినీ పరిశీలించకుండా అన్నమయ్య కులదృష్టిని స్పష్టంగా వివరించే వీల్లేకపోయినా, లభిస్తున్నవాటితో కొన్ని ఒక అంచెనాకి వచ్చే అవకాశం లేకపోలేదు.

భారతీయ సంస్కృతిలో అత్యంత పురాతనమైనవని చెప్పుకుంటున్న వేదాల్లో వర్ణవ్యవస్థ ఉందని కొందరూ,లేదనీ స్వార్థపరులు కొందరు వర్ణవ్యవస్థను వాటిలో చేర్చారనీ, దాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేదనీ వాదించిన వాదనలెన్నో ఉన్నాయి.వాదనల సారమేదైనా, ఋగ్వేదంలోని పురుషసూక్తంలో మహాపురుషుని ప్రస్తావన సందర్భంలో పదవ మండలంలో చాతుర్వర్ణ వ్యవస్థని చెప్పారు.[5] దాన్నెందుకు చెప్పినా, దాన్నెలా అర్థం చేసుకున్నా, ఆ తర్వాత కాలంలో వచ్చిన స్మృతులు (అంటే నేటి చట్టాల వంటివి) వాటిని ఆచరించాల్సిన ధర్మాలుగా చెప్పాయి. ఆచరించకపోతే పాలకులు కఠినంగా శిక్షించారు. ఆ ఆధారాలు నేటికీ సాహిత్యంలో దొరుకుతునే ఉన్నాయి. ఈ “ధర్మాలు” అవిచ్ఛిన్నంగా కొన్నాళ్ళ పాటు అనేకంటే కొన్ని వందలయేండ్లపాటు అమలుకావడం, జైన, బౌద్ధమతాల వాళ్ళూ ఆ “ధర్మాల”ను చాలా వాటిని వ్యతిరేకించినా, విదేశీయులు. అందులోనూ మహమ్మదీయ, బ్రిటీష్ పాలకులు ఈ దేశంలో ప్రవేశించిన నాటినుండీ ఆ “ధర్మాలు” వ్యతిరేకించే శక్తులు తీవ్రతరమైయ్యాయి.

భారతదేశవ్యాప్తంగా క్రీ.శ.12, 13 వ శతాబ్దాల నుండే కాకుండా క్రీ.శ.19 వ శతాబ్దం వరకూ మతసంస్కరణోద్యమాలు ఏదొకరూపంలో కొనసాగి, హిందూమతాన్ని కాపాడాయి. దీన్ని చరిత్రకారులు “బౌద్ధమతాలు, భక్తిమతాలు,వీర శైవ, వైష్ణవ మతాలు ఇవన్నీ ఈ (హిందూ)మత సంస్కరణకుతార్కాణాలు. బుద్ధుడు, మహావీరుడు, ఆదిశంకరాచార్యులు, రామానుజాచార్యులు,నానక్,చైతన్యులు,రామదాసు,కబీరు మొదలైనవారంతా మతసంస్కర్తలు. హిందూమతం క్షీణించక, వేదకాలం నుంచి, ఈనాటి వరకు అది నిలబడి ఉన్నడానికి కారణం ఇదే. మధ్యయుగంలో ఇస్లాం,ఆధునిక కాలంలో క్రైస్తవమతాలు హిందూమతానికి ఎన్నో అవరోధాలు కల్పించినా, హిందువులను

ఆ మతాల్లోకి చేర్పించడానికే ప్రయత్నించినా అవి విదేశాల్లో వలే, మనదేశంలో కృతకృత్యులు కాకపోవడానికి ఈ మతసంస్కరణలే కారణం"[6] అని చరిత్రధ్రువీకరిస్తుంది.6

ఈ సామాజిక పరిస్థితుల్లో జీవించినవాడు అన్నమయ్య. కనుక, ఆయనపై ఈ ప్రభావం తప్పకుండా ఉంటుంది. అందువల్లనే అన్నమయ్య కింది వర్ణాల వాళ్ళు కూడా దైవం దృష్టిలో సమానమనే భావాల్ని వ్యక్తం చేయగలిగాడు.ఆయన ప్రత్యక్షంగా దళితులనే పేరుతో ఈ భావాల్ని వ్యక్తీకరించకపోయినా, భావవాదాన్ని ఆశ్రయించుకున్న దైవం దృష్టిలో జీవులంతా సర్వసమానులనే భావాన్ని ప్రకటించాడు. ఈ భావాలు చాలా సంకీర్తనల్లో కనిపిస్తున్నా ఆయన రాసిన "బ్రహ్మమొకటే... పరబ్రహ్మమొకటే..." ఎంతగానో ప్రఖ్యాతి పొందింది.

ఈ సంకీర్తనను విశ్లేషిస్తూ ఆరుద్ర జీవులకు కర్మ, జ్ఞాన, భక్తి ప్రవత్తులనే యోగాల చేత బ్రహ్మప్రాప్తి కలుగుతుందని వైష్ణవులు భావిస్తారని చెప్పారు.[7] భక్తుడు తన ఆత్మను పరిపూర్ణంగా పరమాత్మలో అధీనం చేయడం జరుగుతుంది. భగవానుని లీలల్ని అనుభవించి, అతని దయను ప్రస్తుతించడమే ప్రపత్తి. సర్వజీవకోటి శరణాగతికి ఉపయోగపడే యోగం ఈ విశిష్టాద్వైతంలో ప్రపత్తుల ద్వారా సాధ్యమౌతుందని భావిస్తారని వివరించారు. దీన్ని బట్టి సర్వజీవులకు శరణాగతుడైన భగవంతుడు, దళితులకు మాత్రం దూరమెందుకవుతాడనేది అన్నమయ్య సంకీర్తనల నుండి గ్రహించగలిగే భావనగా గుర్తించవచ్చు. అందుకనే–

**''నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే**
**అండనే బంటు నిద్ర అదియు నొకటే**
**మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే**
**చండాలుండేటి సరిభూమి యొకటే''**

అని స్తుతించగలిగాడు అన్నమయ్య. పుట్టుకచేత బ్రాహ్మణులైనా, వారిలో తాము నమ్ముకున్న దైవం పట్ల తప్ప భౌతికమైన సుఖదు:ఖాలు తాత్కాలికమని భావించినట్లే, భేదభావాల్ని కూడా నిజమైన భక్తుల పాలిట నిలవజాలవన్నాడు. అందువల్లనే అన్నమయ్య ఒక సంకీర్తనలో–

**''వేదములు చదివియును విముఖుడై హరిభక్తి**
**ఆదరించలేని సోమయాజి కంటె**
**ఏదియును లేని కులహీనుడైనను విష్ణు**
**పాదములు సేవించుభక్తి ఘనుడు''**

అని పలికాడు. యజ్ఞయాగాదులు చేసినా దైవభక్తిలేకపోతే వ్యర్థమన్నాడు. నిజమైన దైవభక్తి కలిగిన వాడు భేదభావాల్ని చూపడనేది అన్నమయ్య భావన. అందుకనే భక్తిలేకపోతే ఏ కులంలో పుట్టినా అధముడేననీ, భగవంతుణ్ణి సేవించేవాడు ఏ కులస్థుడైనా గొప్పవాడేననీ ప్రశంసించగలిగాడు. పండితులు చెప్పే నవవిధ భక్తుల్లో ఏదొక మార్గంలో భగవంతుణ్ణి సేవించుకొనే అవకాశముందనేది అన్నమయ్య భావన కావొచ్చు. నవవిధ భక్తిమార్గాల్ని మించిన అనేక మార్గాల్ని కూడా చూస్తే తప్ప అన్నమయ్య భక్తి అంతసులభంగా అర్థం కాదనేవాళ్ళూ ఉన్నారు. మరొక చోట –

**''అనుగు దేవతలకును అల కామ సుఖమొకటే**
**ఘనకీటపశువులకు కామసుఖమొకటే**
**దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యునకొకటే**
**వొనర నిరుపేదకు వొక్కటే అవియు**
**కొరలి శిష్టాన్నములు కొను నాకటినొకటే**
**తిరుగు దుష్టాన్నములు తిను నాకలొకటే**
**పరగ దుర్గంధములపై వాయువొకటే**
**వరుస పరిమళముపై వాయువొకటే**
**కడగి యేనుగు మీద కాయు యెండొకటే**
**పుడమి శునకము మీద పాలయు నెండొకటే**
**కడు పుణ్యులను పాపకర్ములను సరిగావ**
**జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే''**

అని దేవుడ్ని కీర్తించారు. సర్వజీవులకు సుఖదు:ఖాలు సమానమేననీ, అలాగే ప్రకృతికి లేని భేదాలు, పంచభూతాలు చూపించవనీ, అటువంటప్పుడు మానవులమధ్య మాత్రమే వివక్ష ఉందనీ, అది సరైందికాదనే దృష్టి ఈయన సంకీర్తనల్లో స్పష్టంగా కనిపిస్తుంది. ఈ దృష్టితో చూసినప్పుడు అన్నమయ్య

ప్రత్యేకించిదళితులగురించేచెప్పకపోయినా,సర్వజీవులకూశరణాగతుడైనవాడు భగవంతుడనీ, ఆ శరణాగతుల్లో దళితులు కూడా ఒక భాగమేనని అన్నమయ్య భావించినట్లు ఒక నిర్ధారణకు రావచ్చు.

ఇక్కడ పశు పక్ష్యాదుల నిద్ర, వాటి తిండి, వాటి విధుల్ని జాగ్రత్తగా గమనిస్తే, ఒక్కొక్కరకంగా వాటి జీవనవిధానం ఉండొచ్చు. అవి ఒక్కొక్క విధిని నిర్వర్తిసుండొచ్చు.అయినంతమాత్రం చేత వాటిని తక్కువగా చూడాల్సిన పనిలేదనీ, అవి చేయవలసిన, జీవించాల్సిన పద్ధతిలోనే జీవిస్తూ, చివరికి అవి కూడా భగవంతునిలోనే లీనమవుతాయనే మరోదృష్టి ఉంది. జన్మకు కారణం ఉంటుందనీ, ప్రతి జన్మపైనా ఇంతకు ముందు జన్మలో చేసుకున్న పాపపుణ్యాల ఫలితం ఉంటుందనీ, ఒక్కో పని చేయడానికీ ఒక్కోకారణం ఉంటుందని కర్మసిద్ధాంతంవివరిస్తుంది.పశుపక్ష్యాదులు,మనుష్యులుఅంతాకారణజన్ములని ప్రబోధిస్తుంది.

హిందూధర్మంలో కర్మసిద్ధాంతానికి ఎంతోవిలువుంది. అందుకనే అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని వరప్రసాదం వల్లనే జన్మించినట్లు, తన పదహారవయేట నుండే సంకీర్తనలు, రచనలు చేయడం కూడా దైవానుగ్రహం వల్లనేనని ఆయన గురించి రాసిన చరిత్ర చెప్తుంది.[8] వీటన్నింటినీ చూసినప్పుడు మన విధిని మనం నిర్వర్తిస్తూ, మన పరిధుల్లోనే మనభక్తిని శ్రీహరిపై పెట్టాలనేది అన్నమాచార్యుల వారి బోధన సారాంశం. దీన్ని ఒక సంకీర్తన లో–

**"ఎక్కువకులజుడైన హీనకులజుడైన**
**నిక్కమెరిగిన మహానిత్యుడే ఘనుడు**
**పరమగు వేదాంత పఠన దొరికియు సదా**
**హరిభక్తిలేని సన్యాసికంటే**
**సరవిమాలిన అంత్యజాతి కులజుడైన**
**నరసి విష్ణుని వెదకునాతడే ఘనుడు"**

అనివివరించాడు.దీన్నిబట్టిమనపుట్టుక,మనకివంశపారంపర్యంగాసంక్రమించే విధులు మనచేతుల్లో లేవనీ ఎక్కడ పుట్టినా, ఎక్కడ జీవిస్తున్నా, మనపని (సేవ) మనం చేస్తూనే, మనదృష్టిని మాత్రం భగవంతుడిపైనే పెట్టాలి. దీన్ని మరింత

స్పష్టంగా మరో చోట చెప్పిన సంకీర్తన లో –

**"నిర్మలుడై యాత్మ నియతి గలుగువాడే**
**ధర్మతత్పర బుద్ధి తగిలినవాడు**
**కర్మమార్గములు కడవని వాడే**
**మర్మమై హరిభక్తి మఱవనివాడు"**

అని వివరించాడు. కర్మసిద్ధాంతం ద్వారా భక్తిమార్గాన్ని సర్వజీవులకు ప్రబోధించాడు అన్నమయ్య. అందులో దళితులు కూడా ఉండొచ్చు. పరలౌకిక జీవితం గురించి ప్రబోధించిన హిందూ మతంలోని ఈ "కర్మమార్గమే" దళితుల్ని ఈ లోకంలో అధఃపాతాళానికి తొక్కేసింది. నేటికీ రకరకాల రూపాల్లో సామాజికంగా, ఆర్థికంగా దళితుల్ని మరింత నాశనం చేస్తుంది.

ఉత్తరభారతదేశంలో "భంగీ, చమార్, మాంగ్‌లు, దక్షిణభారతదేశంలో "పాకీవాళ్ళు, రెల్లి, మాదిగ, మాలలు" చేసే మలమూత్రాదుల్ని శుభ్రం చేయడం, పశువుల్ని, మనుషుల శవాల్ని కాల్చడం, పూడ్చిపెట్టడం వంటి పనులు చేయాలి. ఇలాంటి పనులన్నీ పవిత్రమైనవంటూ కీర్తిస్తూనే, ఆ పనుల్ని చేయడం ద్వారానే కర్మమార్గాన్ని ఆచరించి "ముక్తి"పొందొచ్చని "గాంధీమహాత్ముడు" ప్రకటిస్తూ వీళ్ళంతా దేవుని బిడ్డలు(హరిజనులు) అని తన సానుభూతిని ప్రకటించాడు. ఈ "కర్మ"ను వద్దను కున్నా అవి వంశపారంపర్యంగా వెంటాడుతున్న వైనాల్ని భగవాన్‌దాస్ రాసిన "మై భంగీహూ" గానీ,[9] హైదరాబాదు బుక్ ట్రస్టు వాళ్ళు ప్రచురించిన గీతారామస్వామి, విమలలు రాసిన "మాకొద్దీ చండాలం" పుస్తకాల్ని గానీ చదివితే తెలుస్తుంది. సాక్షాత్తూ "భగవాన్ శ్రీకృష్ణుల"వారే గుణ కర్మలను బట్టి వర్ణవిభజన చేశాననీ, కర్మలను ఆచరించడమే తప్ప, వాటి ఫలితాల్ని ఆశించకూడదని బోధించిన వాటినే నేటికీ 'భగవద్గీత'రూపంలో ఏన్నో దేవాలయాల్లో మారుమ్రోగుతున్నాయి. వాస్తవిక జీవితంలో "కర్మలు" ఇలా ఆచరణలో కనిపిస్తున్నప్పుడు అన్నమయ్య చెప్పిన "కర్మమార్గాలు" ఎలాంటివోనని దళితులు ఆలోచించాల్సిందే. అయితే, అన్నమయ్య దళితుల గురించి ప్రత్యేకించి చెప్పకపోయినా, కులనిర్మూలన భావాల్ని ప్రకటించకపోయినా, అంతర్గతంగా కర్మసిద్ధాంతాన్నే ప్రబోధించినా, ఆయన పుట్టిన కుటుంబ పరిధులు, జీవితాంతం శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలోనే గడపడం

వంటివన్నీ ఆయనకు కొన్నిపరిమితుల్ని విధిస్తాయి.

శూద్రకులంలో పుట్టి, పెరిగి స్వతంత్ర ఆలోచనా విధానంతో జీవిస్తూ కులనిరసన చేసిన వేమన, పోతులూరి వీరబ్రహ్మం వంటివారితో పోల్చుకుంటే, అన్నమయ్యకు కొన్ని పరిమితులు, పరిధులు ఉన్నాయని గుర్తించకతప్పదు. అందుకనే అన్నమయ్యను తాత్వికంగా భావవాదైనా, ఆయనలోనూ కవిగా కొన్ని సంస్కరణ భావాలున్నాయని ప్రముఖవిమర్శకులు ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు, ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి మొదలైన విమర్శకులు వ్యాఖ్యానించారు.[10] సుమారు ఆరువందలయేళ్ళ క్రితం నాటి ఒక సనాతన బ్రాహ్మణకవినీ, వైష్ణవభక్తుణ్ణీ నేటి ఇరవై ఒకటో శతాబ్దంలో ఉండి కులంనిర్మూలకు అన్నమయ్య ఏమీ చెప్పలేదని నిర్ణయించడం ఆ కాలంలోకి వెళ్ళి చూస్తే అంత సులువుకాదు. అయినంత మాత్రం చేత అన్నమయ్యను వేమన, గురజాడ, గుర్రం జాషువాల వరసలో చేర్చలేం.[11] ఎందుకంటే అన్నమయ్య తన భక్తిమార్గాన్ని వివరిస్తూ దేవుడి దృష్టిలో అన్ని సమాజిక వర్గాల వారికి స్థానముందని తెలియజేయడం ఆయన లక్ష్యం.


[1] డా॥పప్పు వేణుగోపాలరావు, అన్నమయ్య జాతీయ సదస్సు (హైదరాబాదు విశ్వవిద్యాలయం,24-1-2012 వ తేదీన చేసిన కీలకోపన్యాసం.

[2] పైదే.

[3] ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి: ‘ సంస్కరణ భావవాది అన్నమయ్య (వ్యాసం) ప్రజాకళ, ఆన్‌లైన్ మాసపత్రిక, అక్టోబరు,2010

[4] చిన్నారావు, ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర, 2007: 88

[5] ఋగ్వేదం, పదవ మండలం

[6] అల్లాడి వైదేహి. భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర (1857-1947). తెలుగు అకాడమి ప్రచురణ, 2000:45

[7] ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, మొదటి సంపుటి, తెలుగు అకాడమి, 2002: 996

[8] వేటూరి ఆనందమూర్తి 'భక్తికవుల సామాజిక స్పృహ-అన్నమయ్య' (వ్యాసం) తెలుగులో తొలిసమాజకవులు (సంపా:కె.కె. రంగనాథాచార్యులు.ఆంధ్రసారస్వత పరిషత్: హైదరాబాదు. 1983, పుట:41

[9] తెలుగులో డా॥ జి.వి.రత్నాకర్ అనువాదం 'నేను భంగీని'

[10] కె.కె.రంగనాథాచార్యులు. తెలుగులో తొలి సమాజ కవులు (సంపా:.) ఆంధ్రసారస్వత పరిషత్: హైదరాబాదు. 1983

[11] అన్నమయ్య "కులంతో సంబంధం లేకుండా సత్యం తెలుసుకున్నవాడు ఘనుడంటున్నాడు. ఈ పదాన్ని పట్టుకొని అన్నమయ్యను, గురజాడ, వేమనల వరసలో నిలబెడితే ఎలా? విగ్రహాన్ని తిరస్కరించిన గురజాడకు, విగ్రహాన్ని నమ్ముకున్న అన్నమయ్యకు ఎక్కడ పోలిక?" చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం, చర్చ

(తెలుగు సాహిత్య విమర్శ, పరిశోధనల మీద వ్యాసాలు)
2010: పుట: 67. ( తొలి ముద్రణ: 2006)

> కమలాక్షుని మతిగాననిచదువులు ।
> కుమతంబులు బహుకుపథములు ।
> జమళి నచ్యుతుని సమారాధనలు ।
> విమలములే కాని వితథముగావు

# క్షేత్రయ్య పదకవితా వైశిష్ట్యం



ఆచార్య వెలమల సిమ్మన్న
✆ 94406 41617



"తేనెకన్నా మధురంగా, వాన కన్నా చల్లగా, గాలి కన్నా స్వేచ్ఛగా, పాట పాడి, పాడినదంతా పచ్చ బంగారంగా చేసిన గాయక శిఖామణి క్షేత్రయ్య. క్షేత్రయ్య భక్తుల్లో అగ్రగణ్యుడు. రసికుల్లో మొదటివాడు. వీధిని పడి వేడుకతో నడచిన విటరాయుడు. వెళ్ళిన ప్రతీ ఊళ్ళోనూ స్వామిని దర్శించి, సానివాడను హర్షించి ఇద్దరినీ ఏకకాలంలో చరితార్థం చేసిన కవివరుడు క్షేత్రయ్య. శృంగారాన్ని కాచివడపోసిన వెజ్జు. దేవునికే పాఠాలు చెప్పిన ఒజ్జ. పడక గదిని బజారుకి లాగిన ఆకతాయి. పరమాత్మతో నేస్తం కట్టిన యోగి. పర స్త్రీల రహస్యాలు తెలిసిన భోగి. మువ్వగోపాలుని చల్లని మోనీ. పిల్లనగ్రోవీ తానే అయిన ధన్యుడు. క్షేత్రయ్య పాడని ప్రణయ వేళ, చూడని మధురలీలలు లేనేలేవు. అతడు చూసిన ప్రతీ దృశ్యంపైనా పదం పాడి, లక్షణ గ్రంథాలకే భిక్ష పెట్టిన జాణ క్షేత్రయ్య"

తెలుగు పద సాహిత్యానికి 15వ శతాబ్దం వసంతకాలం. ఈ కాలంలో

వేలకు వేలు పదాలు సృష్టించబడ్డాయి. తెలుగు పదకవితకు ఆద్యుడు అన్నమయ్య. ఇతనికి సంకీర్తనాచార్య, పదకవితా పితామహుడు అనే బిరుదులు వున్నాయి. అన్నమయ్య పూర్వులు కూడా పదకవితా రచనలు చేశారు. సంగీత సాహిత్యాలకు సమాన గౌరవంతో పాటు అభినయాన్ని జోడించి, పద రచన చేసిన పద కవితా చక్రవర్తి క్షేత్రయ్య. పదమంటే శృంగార పదమన్న ప్రసిద్ధిని తెచ్చినవాడు క్షేత్రయ్య. తర్వాత చెప్పుకోదగ్గవారు సారంగప్రాణి, భక్తరామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి, త్యాగరాజు మొదలైనవారు.

క్షేత్రయ్య పూర్వనామం వరదయ్య. అనేక పుణ్యక్షేత్రాలు సందర్శించడం వల్ల క్షేత్రయ్య అనే పేరు వచ్చింది. ఇతడు "మొవ్వ" గ్రామంలో జన్మించాడు. ఇది కృష్ణా మండలంలోని కూచిపూడి, పెద్దపూడి, ఘంటసాలకు దగ్గరలో వుంది. ఆ "మొవ్వ"లో వెలసిన మువ్వగోపాల స్వామిపై భక్తి, శృంగార రస భావాలతో రాసిన పదాలే మువ్వగోపాల పదాలు. 'మొవ్వ గోపాల' లో ప్రసిద్ధమైన "మొవ్వ" శబ్దం "మువ్వ"గా వ్యవహారంలో మారి వుంటుందని పరిశోధకుల అభిప్రాయం. "మువ్వ గోపాల" మకుటంతో రాసినవే క్షేత్రయ్య పదాలు. మొదటలో గొడ్ల కాపరిగా, అల్లరి చిల్లరిగా తిరుగుతుండేవాడు క్షేత్రయ్య. ఒకరోజు ఒక యోగి వల్ల, గోపాల మంత్రోపదేశం పొంది, జపించి, ఆ శృంగార దేవత అనుగ్రహం పొందారు. అప్పటినుండి మువ్వగోపాల మకుటంతో అద్భుతమైన భక్తి, శృంగారరస ప్రధానమైన పదాలు క్షేత్రయ్య రాశాడు.

అన్నమయ్యతో ప్రారంభమైన పద రచన క్షేత్రయ్యతో సమున్నత స్థానం పొందింది. పద రచనలో సిద్ధహస్తుడు క్షేత్రయ్య. ఇతడు మోహనంగి అనే ప్రియురాలి ప్రేరణ వల్ల, మొవ్వలో వెలసిన గోపాలునిపై పదాలు రాశాడు. మువ్వగోపాలుని భక్తుడై, చరితార్థుడయ్యాడు క్షేత్రయ్య. విజయనగరం పతనం తర్వాత తెలుగు కవులను, సాహిత్యాది కళలను పోషించే నాథుడు లేకపోయాడు. గత్యంతరం లేక క్షేత్రయ్య దక్షిణదేశానికి వెళ్ళవలసి వచ్చింది. దక్షిణ భారతదేశంలో తంజావూరు మధుర నాయకులు తెలుగు సాహిత్యాన్ని కళలను పోషించారు. చరిత్రలో ప్రసిద్ధికెక్కారు. ఇతరులకు మార్గదర్శకులు అయ్యారు.

క్షేత్రయ్య జీవితం ప్రధానంగా రెండు భాగాలు. పూర్వభాగం రక్తితోనూ, ఉత్తరభాగం మధురభక్తితోనూ, గడిచింది. అంటే మొదట భోగి. తర్వాత యోగి. క్షేత్రయ్య పదాలు ప్రధానంగా శృంగార రస సంబంధమైనవి. శృంగారంతో పాటు మధురభక్తి ప్రకటించి తరించాడు. మువ్వ గోపాలుడు నాయకుడు. తానే నాయిక. క్షేత్రయ్య పదాలు గాయకులకు ఉల్లాసం, వినేవారికి ఆనందం కలిగిస్తాయి.

శృంగార పద రచనా వైవిధ్యంలోనూ, మధురభక్తి ప్రతిపాదనలోనూ, సంగీత సాహిత్యాలతో పాటు అభినయాన్ని పదంలో పుష్టిగా, తుష్టిగా నిరూపణం చేయడంలోనూ, పేరుగాంచిన వాడు క్షేత్రయ్య. భావంలోనూ, భావ వ్యక్తీకరణంలోనూ, పద రచనా శిల్పంలోనూ, వర్ణనలోనూ, అలంకారంలోనూ, భక్తిలోనూ, మధురభక్తిలోనూ, ఇలా అనేక అంశాల్లో ఆరితేరినవాడు క్షేత్రయ్య.

క్షేత్రయ్య సుమారు నాలుగువేలకు పైగా పదాలు రాసినట్లు తెలుస్తున్నా, నాలుగువందలు మాత్రమే లభిస్తున్నట్లు పరిశోధకులు చెప్పుతున్నారు. కర్ణాటక సంగీతపు రాగాలకు, చాలావాటికి స్పష్టమైన రూపం కల్పించినవాడు క్షేత్రయ్య.

**"తముదాముపత్తు రుర్థులు**
**క్రమ మెఱిగిన దాతకడకు రమ్మన్నారా**
**కమలములుండే చోటుకి**
**భ్రమరమ్ముల నచ్యుతేంద్ర రఘునాథనృపా"**

ఎవరు రమ్మని పిలువగా నా సభకు వచ్చావని రఘునాథుడు ఛలోక్తిగా అడుగగా, దానికి క్షేత్రయ్య సమాధానంగా ఆ సభలో ఆశువుగా చెప్పిన పద్యం ఇది. ఈ పద్యం వల్ల క్షేత్రయ్య రఘునాథుని ఇందిరా మందిరాన్ని సందర్శించినట్లు తెలుస్తుంది.

## క్షేత్రయ్య పదాల్లో నాయికా నాయకుల విరహ వర్ణన :

నాయికానాయకులు ఎడబాటు వల్ల పొందే ఆవేదనను క్షేత్రయ్య రమణీయంగా వర్ణించాడు. క్షేత్రయ్య వర్ణించిన నాయకుడు మువ్వగోపాలుడు. ఇతనికి అనేకమంది నాయికలున్నారు. అంచేత ఒకరి దగ్గర నుంచి మరొకరి దగ్గరికి వెళ్ళేటప్పుడు ఆయా నాయికలు విరహవేదన చెందుతారు. ఒక్కొక్కసారి

నాయకుడు కూడా తన మనసుకు నచ్చిన నాయిక దూరమైనందుకు విరహవేదనకు లోను అవుతాడు. ఈ విధమైన అంశాలను క్షేత్రయ్య సహజసుందరంగా వర్ణించాడు.

ప. ఈ మేను జీవునకు ఎంత ప్రియ మాయన్
అప. భామ మా మువ్వ గోపాలు కౌగిటలేని

చ. పడతినే నొక చోట ప్రాణేశుడొకచోట
ఎడబాసి మరునిచే యిడుమలకు లోనైతి
కడలేని విరహాగ్నిక్రాగి వేగితి చాల
పుడమిలో వేరే జన్మము కలదే సుదతి

మోము జూడ మనసై మోవియాన నోరూరి
యామకొన్న ప్రేమచే నసురుసు రనువు
సోముకాకల జిక్కి సొమ్మసిల్లగా మేను
కామినిరో! యెడ తెగని కన్నీట నిటులన్న

కంతురేళి మువ్వగోపాలు గలసియున్నది తలచి
వింతతోచి నా మనసు వేవిధము లాయెన్
యింతిరో, విభుసేమ మీ వరకు విననైతి
యెంత వ్రాత వ్రాసి యున్నదో? యింతకు తాళియున్న

నాయిక తన విరహాన్ని గూర్చి, ప్రియునిపై తనకున్న గాఢాను రక్తిని గూర్చి చెలికత్తెతో నా ప్రియుడైన మువ్వగోపాలుడు కౌగిటలో లేని ఈ నా శరీరంలో జీవుడు ప్రియంగా ఎలా వుంటున్నాడో కదా! నేనొకచోట, నా ప్రాణనాథుడు ఒకచోట, వేరుగా వుండడం వల్ల మన్మథుడు పెట్టే కష్టాలకు గురి అవుతాడు. చెప్పలేని విరహమనే అగ్నిచే ఎంతగానో కాలిపోతాడు. ఈ భూమిపై ఇంతకన్నా ఏమైన కష్ట మైన జన్మం వుందా! అతని ముఖం చూడాలని మనసు కలిగింది. పెదవి ఆనించాలని నోరూరింది. అలముకున్న ప్రేమ వల్ల ఉబలాటం కలిగింది. చంద్రుని వెన్నెల వల్ల వేడి కలిగి శరీరం అలిసిపోయింది. కన్నీరు ఎడతెగకుండా కారుతూనే వుంది. గతంలో మువ్వ గోపాలునితో జరిగిన మన్మథకేళిని తలచుకుంటే నా

మనసు వెయ్యి విధాలుగా అవుతుంది. నా ప్రియుని క్షేమ వార్తను ఇంతవరకు వినలేదు. విరహబాధను సహించుకుంటున్నాను. ఎంత తలరాత రాసి వుందో మరి అని విరహ బాధపడుతున్నట్లు క్షేత్రయ్య విపులీకరించాడు.

ప. ఏలవలసితినమ్మా యెట్లా వేగింతునే కొమ్మా!

అప. యిలాగౌట యెరుగనైతి యెదగురి చెలువ రాయనిపై

**చ. ఉన్నచోట నుండనీదు ఒరుగుపై నన్నొరగనీదు**
**అన్నాహారము లేదు అనబాలు తేనెచేదు**
**చలువలైతె సైచదాయ జాజులెంతో మొనలాయ**
**నిలుపరాని మోహమాయ నిట్టూర్పులగ్గల మాయ**
**తలపువాని మీద నాయ తలవాకిలేయిల్లాయ**
**పలుమారు గదిసిన మువ్వగోపాలుడౌ చెలువరాయనిపై**

నాయక, తన విరహబాధను గూర్చి చెలికత్తెతో అతన్ని ఎందుకు వలచానో ఏమో! అతను లేకుండా వుండలేకపోతున్నాను. ఇలా అవుతుందని నాకు ముందు తెలియదు. వున్నచోట వుండలేకపోతున్నాను. పడకపై ఒరగనివ్వడు. అన్నం తినడం లేదు. పాలు, తేనె, చేదుగా వుంది. చల్లటి పదార్థాలను సహించలేకపోతున్నాను. జాజిపూలు వాడిగా గుచ్చుకుంటున్నట్లు అనిపిస్తుంది. మోహాన్ని ఆపలేకపోతున్నాను. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అధికమయ్యాయి. ఎన్నోసార్లు కలుసుకున్నాను. అయినా నా ప్రియుని మీదే నా మనసు స్థిరమయింది. తలవాకిలే ఇల్లు అయింది. ఎదురుచూడటంతోనే సరిపోతుంది అని వివరిస్తుంది. ఇక్కడ ఆమెకు స్వామిపై వున్న ప్రేమభక్తి సువ్యక్తమవుతుంది.

ఇలా క్షేత్రయ్య పదాల్లో నాయికా నాయకుల విరహవేదనను కమనీయంగా వర్ణించాడు. నాయకుని కోసం నాయిక ఆవేదన చెందడం, నాయిక తన విరహ బాధను చెలికత్తెకు చెప్పుకోవడం, నాయకుని విరహవేదన మొదలైన అంశాలను క్షేత్రయ్య మనోహరంగా వర్ణించాడు.

## క్షేత్రయ్య పదాల్లో చెలికత్తె సందేశం :

క్షేత్రయ్య పదాల్లో చెలికత్తె పాత్ర చాలా ప్రాముఖ్యమైనది. నాయికా నాయకుల మధ్య ఏ కారణాల వల్లనైనా మనస్పర్థలు ఏర్పడినప్పుడు ఒకరికొకరు

కలహించుకొని ఎడబాటుగా వున్నప్పుడు చెలికత్తె రంగప్రవేశం చేసి తగిన విధంగా ఓదార్పు చెప్పడం, సందేశమివ్వడం కనబడుతుంది. అలాగే నాయికానాయకుల సమైక్యాన్ని చూచి ఆనందించడం కూడా మనకు కన్పిస్తుంది. క్షేత్రయ్య చెలికత్తె పాత్ర ద్వారా సందేశాన్ని వ్యక్తం చేశాడు.

**ప. నెలత అతడు అలిగేది ఎల్ల - నెనరు గాదటవే?**
**అప. వెలవెల బోనేల మోము - చెలువుని తోడి తెచ్చెదనె||**

**చ. కాటుక కన్నుల నీరు - ఘనమైన నీలముల వలెనె**
**పైట తడసి రవికదూసి - గుబ్బలపై నిండెనె**
**యేటికి యీవట్టి వెతలు - యిందు వదన పెరువనేలే**
**నేటి మాపటివేళ - నీ విభుని నిను గూర్చెదనె||**
**వాని ప్రేమ తెలియకనే - వలపు నీవు నిలువలేక**
**మేనెంతో కరిగెగాక - మెళుకువ దెలియక**
**ఓనాతిరో నన్ను వినా - నూరడించే చెలులున్నారా?**
**నేనీదాననైనందుకు - నీ వారుల వేడదగునా**
**వనిత మువ్వ గోపాలుడౌ - వరదుడు నిన్ను గూడి ఆ**
**వెనుక కనులెత్తి యే చెలినైన - జూచునా?**
**మనసుగట్టి చేసుకోవే - మగువ నా మాట నమ్మవే!**
**కినుక వలదే తాళుకోవే - ననబోణి గెలుపు నుండవే**

నాయకుడు తనపై అలిగి, తన దగ్గరకు రానందుకు నాయిక చాలా దుఃఖిస్తుంది. అప్పుడు చెలికెత్తె నాయికతో, నీపై అతడు అలిగేది అంతా నీమీద వున్న ప్రేమచేతనే కదా! నీ ముఖం కళా విహీనం కావడం ఎందుకు? అతన్ని నేను పిలుచుకొని వస్తాను. కాటుక పెట్టుకున్న నీ కన్నుల నుండి కారే కన్నీరు ఘనమైన నీలమణుల్లాగా వుంది. ఆ కన్నీరు నీపైటను తడిపి రవికను దూసుకొని పోయి నీవక్ష స్థలంపై నిండింది. ఓ చంద్రముఖీ! ఎందుకు ఊరికే బాధపడతావు. రేపు సాయంత్రానికంతా నీ ప్రియుని నీకు సమకూర్చుతాను. అతనికి నీమీద ఎంత ప్రేమవుందో నీకు తెలియక, దిగులు పడుతున్నావు. నాకన్నా నిన్ను ఊరడించేవారు ఎవ్వరూ లేరు. నేను నీ దానను. ఇంకెవ్వరిని వేడుకోవద్దు. నిన్ను కలిసిన

మువ్వగోపాలుడైన నీ ప్రియుడు ఇంకెవ్వరినీ కన్నెత్తి చూడడు. మనసును గట్టి చేసుకో. కోపం వద్దు. సహనం అలవరచుకో. ధైర్యంగా వుండు, నా మాటను నమ్ము అని ఓదార్పు చెబుతున్నట్లు క్షేత్రయ్య ఈ పదంలో తెలియజేశాడు.

ప|| తాళిమొకరి కన్నా వద్దా - ఓ చెలియరో
అ||ప|| లోలాక్షి! మువ్వగోపాలునికి నీకు మాటలైతే

చ. వాడలుగ నీవలుగ వశమై మీకై తిరుగు
లాడినది చాలునే యెవరు మెత్తురే
చూడక మీరినట్లున్నది మీకు కోపము
వీడక ముక్కుక నున్నది ఓ చెలియరో

చలమున వాడొకటంటే సెగగా నూరకుండక
చెలియరో! యిదేటి కోపము చెల్లునె మీతోడ
చెలిమి చేసిన పాపము యెందుకె మీకు
వలువని మనస్తాపము ఓ చెలియరో

ఎలమిపాలు నీరు వలెనె కలసి మువ్వగోపాలునితో
చెలియరో! యీ చలయేటికి? యిటువంటి గుణము
చెల్లునే నీవంటి మేటికి వివేకమింత
వలువదా లెస్సాయను నేటికి ఓ చెలియరో

నాయికా నాయకులు ఇద్దరూ పరస్పరం వాదులాడుకోవడం చూచి చెలికత్తె నాయికతో, సహనం మీలో ఒకరికన్నా వుండాలికదా. నీవు, మాటిమాటికి ఇలా అలుగవచ్చా. మీకోసం తిరుగలాడింది, ఇక చాలు. మీ ప్రవర్తనను, ఎవరు మెచ్చుతారు? మీ ఇద్దరికి కోపం ముక్కు మీదే వుంది. ఏదో పంతంతో అతను ఒక మాట అంటే ఊరుకోకుండా ఇంతకోపం చూపించడం నీకు చెల్లదు. మీతో స్నేహం చేసిన పాపానికి నేను కూడా బాధపడుతున్నాను. మీలో మీకు మనస్తాపాలెందుకు? మీరు పాలు నీళ్ళులాగా కలిసి వుండాలి. ఇంతపంతం మీకు చెల్లదు. నీవంటి గొప్పదానికి ఇలాంటి గుణం తగదు. వివేకం వుండాలి అని సుతిమెత్తనిగా సందేశం ఇస్తుంది చెలికత్తె.

## మనోజ్ఞత :

క్షేత్రయ్యకి, కవికి వుండవలసిన ప్రతిభా లక్షణాలు వున్నాయి. మనోజ్ఞ పదరచన చేయడంలో అతనికి అతనే సాటి.

**ప. చాలు చాలు ఈ చిన్నెలతో నాదు సరసకు జేరకుర**
**అ.ప. ఈ చిన్నెలు సాగవు నావద్ద! మువ్వ గోపాల!**

**చ. కన్నుల వీడెముతో - కాటుక మోవితో**
**వెన్నున కీల్జడ - వేటుతోను**
**కన్నియు కెంపుల - గాజుల నొక్కులతోను**
**వన్నెకాక! నుదుట - నున్నలత్తుకతోను**
**(చాలు)**
**నిదుర మబ్బుతోను - నిండు బడలికతోను**
**ముద్దియు కలసిన - ముదముతోను**
**నిద్దంపు చెక్కిళ్ల - నెలవంకలతోను**
**వద్దురా పద్దులు - వగకాడ! నాతోను**
**(చాలు)**
**అలదాని కుచముల - నలదిన జివ్వాజి**
**కలయుర స్థలమును - నంటి నన్నంటరాకు**
**బలిమి చేసేదేల - బాలమువ్వగోపాల**
**అలనాడె గూడిన - చెలిమి పదివేలు**
**(చాలు)**

క్షేత్రయ్య రాకతో, పదవాఙ్మయ చరిత్రకు మంచి పేరు వచ్చింది. అసలు పద కవిత్వానికి ఆది బ్రహ్మ అన్నమయ్య అయినప్పటికీ, శృంగార పదాలకు క్షేత్రయ్య పెట్టింది పేరు.

**ప. మగు వతనకేలికా - మందిరము వెడలెన్**
**అప. "వగకాడ మాకంచి - వరద తెల్లవారేననుచు**
**విడజారు గొజ్జంగి - విరిదండ జడతోను**
**కడు చిక్కువడి పెనసగు - కంటసరితోను**
**నిడుద కన్నులదేరు - నిదుర మబ్బుతోను (మగువ)**

తరి జేసుసేయుసను సురత బడలికతోను
జరుత పావడ చెఱగు - జార్పైటతోను
ఇరుగడల కైదండ - విచ్చుతరుణులతోను
పరమాత్మ! మువ్వగోపాల తెల్లవారె ననుచ"
(మగువ)

## చమత్కార చతురత :

చమత్కార చతురత క్షేత్రయ్య పదాల్లో కన్పిస్తుంది. నాయికా నాయకుల పరిహాసాత్మకమైన మాటల్లో చమత్కారం కన్పిస్తుంది.

ప. మంచిదానవే చెలియ! మాటలకును
అప. పంచనగల సఖియని - వార్త చెప్పకోవస్తే
(మంచి)
సకియ నీ చన్గవలు - సంగటి కొండలందుగాని
కొండలైతే కోట - తలుపులేవే?
ఇన నేనేమి సేయుదు? మువ్వగోపాల?
ఇదిగో పాలిండ్లపై తర్కింప రవికముడి తలుపుగాద"
(మంచి)

దీనిలో నాయికా నాయకుల ప్రత్యుక్తులతో కూడిన చమత్కారాన్ని గమనించవచ్చు.

## పదచిత్రాలు :

కొన్ని శబ్దాల సముదాయంతో ముచ్చటైన భావచిత్రాలు పాఠకుల మనోనేత్రాలతో తళుక్కున మెరసేటట్లు చిత్రించగల నేర్పు క్షేత్రయ్య సొంతం. ఉదాహరణకు "వడిచిపో నడి – వడిగొన్న సరులతో" అనే పదాల్లో సహసుందర భావ చిత్రాలు కన్పిస్తాయి. విడిచిపోతే నడవడిగొన్న చనుగవ, జీరుకుప్పనను సడలియాడెడు వీరులచేరు, నుదిటిపై నిడిన కస్తూరి చెమటచే కన్నుల మీదికి జారడం, ముంగురులు చెదరి కనుబొమ్మల్ని సొంపు తిలకించడం.... మొదలైన భావచిత్రాలు సహృదయభావనై వేద్యాలు. అలాగే ఒక నాయిక నాయకుని ఒంటే మీద గంధము చాటున ఘనమైన జడవేటు "నల్లకందియున్న సొగసు" ను కనుగొన్నదట. ఇలాంటి పదచిత్రాల దృశ్యాలు క్షేత్రయ్య పదాల్లో చాలా కన్పిస్తాయి.

## రచనారీతి :

పదకవిత్వంలో అల్పాక్షరాల్లో అనల్పార్థం సాధించాడు కవి క్షేత్రయ్య. మువ్వగోపాలుని వగలెల్ల తెలిసిన పరకీయ, ఖండిత అయిన నాయిక అన్న మాటలు ఉదాహరణగా తీసుకోవచ్చు.

**ప. తెలియవచ్చెనురా! నీవగలెల్ల దృష్టితాకీనిరా**
**అను. "వెలయు మువ్వగోపాల! దానింటనుండి**
**విచ్చేయు హోయలు చూచితే ఇప్పుడు**
**దక్కిన నలినాక్ష! దానిపై నొంప్పు**
**(తెలియ)**
**సందిట బంగారు గాజులదుద్దు**
**సకియ దిద్దిన నుదుటి తిలకము ముద్దు**
**అందకాడ! మువ్వగోపాల! యీ ప్రొద్దు**
**యిందు వచ్చి నన్నేవినపద్దు"**
**(తెలియ)**

నాయకుని రూపురేఖలు మనకు కళ్ళకు కట్టినట్లు చక్కగా వర్ణించాడు. ఇక్కడ పదాల్ని పొదుపుగా వాడాడు క్షేత్రయ్య.

## వర్ణనా వైభవం :

**పద కవితలో కూడా వర్ణనా వైభవాన్ని ప్రదర్శించాడు క్షేత్రయ్య.**
**ప. ఎంత చక్కనివాడే - నా సామి వీడెంత చక్కనివాడే**
**అప. "ఇంతి మువ్వగోపాలుడు - సంతతము నా మదికి సంతోషము చేసునె (ఎంత)**
**తళుకారు చెక్కు - ముద్ద మాటలవాడే**
**తలిరాకు జిగి దెగడ - దగు మోవి గలవాడే**
**తెలితమ్మి రేకుక - న్నుల నమరువాడె**
**(ఎంత)**
**కొదమసింగపు నడుము - కోమరమరువాడే**
**మదికరి కరముల - మరపు చేతులవాడే**
**సుదతి! మువ్వగోపాలుడెంత - సొగసు గలవాడే"**

(ఎంత)

నాయక వర్ణనను ఎంతో అద్భుతంగా వర్ణించాడు క్షేత్రయ్య.

**అలంకారాలు :**

అంత్యానుప్రాసకు ఉదా:

"ఇతనికి పెరచినే - నికలంచమిచ్చేనా
ఇన్నాళ్ళ వలె నను స - రించేనా
బలిమాలినే రాయ - బారమంపించేనా
పతియని మునుపటి - భక్తిదయలుంచేనా"

ముక్తపదగ్రస్తానికి ఉదా :

"ఈయగలిగితే రా - రాగలిగితే తే
తేలేకుంటే పో - పో లేకుంటే"

ఉపమాలంకారానికి ఉదా:

"అడవిలో ప్రొద్దు గూక - అంధకారమైన వానలో
తడిసి దోవగానని - దాని వలెనున్న తనకు"
"కాటుక కన్నులనీరు - ఘనమైన నీలముల వలెనే
పైట తడిసి రవికె దూసి గుబ్బలపై నిండెనే"

క్షేత్రయ్య పదాల్లో సూక్తి సౌరభాలు :

శృంగార పదరచనలో ఘనుడు క్షేత్రయ్య. ఆయన పదాల్లో సార్వకాలికమైన సార్వజనీనమైన స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన సూక్తులు విస్తారంగా కన్పిస్తాయి. మానవ జీవితానికి ఉపయుక్తమయ్యే అనేక రకాల సూక్తి సుమాలు నిత్యనూతనంగా గుభాళిస్తున్నాయి.

- ★ నాకోసమే నన్నింత చేసెనమ్మా
- ★ తెలివి యొకరి సొమ్మా
- ★ చెరుకు తీపని వేరుతో పెకలించేవు
- ★ ఆడి తప్పకు దోసము ఆది వరహా
- ★ మటుమాయలు చాలించు
- ★ ఇంతదుడుకు తగునే వానికి, నేను మగనాల గాదటనే
- ★ ఊరకే నిన్ను జూచి యుసురనే దోసకారులు, ఒకరి మేలు సైతుర

★ మనసుగలిగితే దినమొక్కసారి మాయింటికి రావా
★ ఏటి మమత యెక్కడియాస యెవ్వరికెవ్వరే
★ మనసునిన్నెడ బాయదు ప్రాణేశ
★ ఏలనేవాదు సామితో మనకేలనే
★ తనకుగాని భూమి ఫలమై యేమి యెవరి పాలైతేనేమి
★ తారుమారు మాట లేల నాడేరే
★ నా విధిగాని నన్ని బలిలేదు
★ సామికి సరియెవ్వరే చక్కని నా సామికి
★ అనుకూలుడైనట్టి మగవాడు గలిగితే, అంతకన్నను సంభ్రమున్నాదా
★ ఏరమువ్వగోపాల, యీ చలమేలరా
★ ఒక్కరైన గాని నాయక్కర కుదిగేరా
★ ఇచ్చోటను చాలప్రొద్దుండ చెల్లదు, యింటికి పోవలెర
★ ఎంత వలపైనను మొగవానికసమిచ్చి మాటలాడుదుర
★ ముద్దలేని వానితోని ముచ్చటలేవే

## సామెతలు :-

తెలుగుపలుకుబళ్ళు,నుడికారాలు,సామెతలు,పలుకుపలుకునతేనెలూరు తీరున తమకు తామే క్షేత్రయ్య పదాల్లో చేరిపోయాయి. తెలుగుదనానికి మారుపేరు క్షేత్రయ్య. ఇతని పదాల్లో ఆనాటి వాడుకలోని సామెతలు చోటు చేసుకున్నాయి.

★ మేకవెన్నె పులివలె
★ చలియించని నిండు కుండవలె
★ తెల్లని వెల్లపాలు నల్లనివి నీళ్ళనుచు
★ కలిమిలేము లనగ కావడి కుండలు
★ ఇంట గెలిచి రచ్చ గెలువవలెను
★ పానకములోని పుడకవలెనున్న వితము
★ కాలము పోవును కడకు మాట నిలుచును
★ ఏ పుట్టలో ఏ పామున్నదో

## సంస్కృతీకరణ :

తెలుగు సాహిత్యం అనువాదంతో ప్రారంభమైందన్న విషయం మన అందరికీ తెలిసిందే. అదే విధంగా గిడుగు వేంకట సీతాపతి గారు క్షేత్రయ్య పదాలను కొన్నింటిని సంస్కృతీకరించారు. ఇదొక ప్రత్యేక విశేషం. పిఠాపురం మహారాజా వేంకట కుమార మహీపతి సూర్యారావు బహుద్దర్ గారి సమాదరణలొ 1952లో సీతాపతిగారు క్షేత్రయ్య పదాన్ని పరిష్కరించి ప్రకటించారు. మూలభావం చెడకుండా క్షేత్రయ్య పదాలను సీతాపతి గారు ఎంతో చక్కగా సంస్కృతీకరించారు.

## ప్రముఖుల అభిప్రాయాలు :

క్షేత్రయ్య పదాల్లోని సంగీతాన్ని గూర్చి, సాహిత్యాన్ని గూర్చి, ఎందరో ప్రముఖులు ప్రశంసించారు. క్షేత్రయ్య పదాల సంగీత సౌరభాన్ని సుబ్బరాయ దీక్షితులు గారు ఇలా అన్నారు. "క్షేత్రయ్య పదములవలె శృంగార రసములొలుకునట్లు కైశికీరీతిగాను, అర్థపుష్టితోను, సందర్భాలకు తగినట్లు రాగములతోను, ధాతువులతోను ఇతనికి మునుపుగాని, వెనుక గాని పదములు జూడదగని వారవరు లేరని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈతని పదములు శబ్దార్థముల చక్కగా నెరిగి రసానుభవముతో నెవరు (చౌకముగా) విలంబముగా పాడుచున్నాడో ఆపదములు రుచించును. ధాతువులను వ్రాసి జూచితే వచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే పద సాహిత్యములశయ్య. ధాతువులు వచ్చినవి రాక యుండుట కీర్తనముల శయ్య."



సంగీత సాహిత్యాల్లో సముచిత రీతిని తన పదాల్లో అభినయాన్ని సమ్మేళనం చేసిన అభినయాచార్యుడు క్షేత్రయ్య అని విస్సా అప్పారావు గారు అన్నారు.

"క్షేత్రయ్య నాట్య విద్యా విశారదుడు. కైశికీ విద్యా ప్రధానమగు నాట్య కళయందు, అభినయ కళయందు, సంపూర్ణ ప్రజ్ఞ నేర్చిన వాడని చెప్పవలసియున్నది. ఇతడు పాదములను పాడి, అభినయము నభియించుచు ఆడి, నృత్య గీత నాదాత్మకమగు సంగీతమును అనుభవించి రససిద్ధి పొందిన సంగీత వేత్తయని చెప్పుటకు ఏమియు సందేహమక్కరలేదు."

క్షేత్రయ్య అపూర్వరాగాలు వాడి, వాటికెంతో సొగసును ఆపాదించాడని విస్సా అప్పారావు గారు అన్నారు. "క్షేత్రయ్య పదాలలోని పల్లవి, అనుపల్లవి, చరణములలో క్రమముగా రాగవృద్ధి ఎట్లు చేయబడినదో ఒకే రాగమందలి వివిధ పదములలోని స్వర సంచారములు, గమక భేదములు, అలంకారములు పదము యొక్క భావానుగుణముగా రసము పోషించుచు ఎట్లుండునో ఎన్ని భావభేదములకు ఒకే రాగమే ఎన్ని విధముల వాడబడినదో, బాగుగా పరిశీలించినచో క్షేత్రయ్య సంగీతానుభవము ఎంత ప్రతిభావంతమైనదో వ్యక్తము కాగలదు. ఎత్తుగడ, తర్వాత నడక, స్వర సంచారములు, పోకడలు రాగము యొక్క జీవకళలను పదగమనములో చిప్పిలజేయుచుండును."

పదంలోని మాటలకు తగిన విధంగా రసభావాలకు అనుగుణంగా రాగస్వరూపం రూపొందించడంలో క్షేత్రయ్య ఘనాపాటి. క్షేత్రయ్య సంగీతజ్ఞతను గూర్చి, బాలాంత్రపు రజనీ కాంతారావు గారు ఇలా అన్నారు. "కరుణ రసంలో బాహ్య మాత్రమైన దుఃఖమూ, ఉపశమించుకోగల దుఃఖము, దుర్భరమైన దుఃఖమూ, హృదయ విదారకమై బావురుమనే విలాసంతో కూడిన దుఃఖమూ, ఈ వివిధ దుఃఖావస్థలు గల పదాలకు ముఖారి, ఘంటా, నాదనామ క్రియ, పున్నాగవరాళి, కాంభోజి వంటి రాగాలను (క్షేత్రయ్య) వాడుకున్నాడు. ప్రస్తారానికి పూర్తి అవకాశం లేని ఆహిరి, ఘంటా, సైంధవి, కర్ణాటక కాపీ, నవరోజు వంటి రాగాలను కూడా బహుసూక్ష్మ ప్రయోగాలలో వాడి ఒడలు ఝల్లుమనిపించగలిగినమహాశిల్పి. ఇతని ప్రతిపదంలోనూ రాగభావం మీగడవలె పైన తెరకట్టి ఆఛ్ఛాదించి వుంటుందని విద్వాంసుల అభిప్రాయం."

పదసంగీత పితామహుని గూర్చి గోపాల కృష్ణమూర్తిగారు ఇలా అన్నారు. "అన్నమయ్య పద కవితా పితామహుడు. క్షేత్రయ్య పద సంగీత పితామహుడు.

ఈయన పద సంగీత మాధుర్యమే సంగీత రచనను శంఖలీల, సింహ తళాటము వంటి తళ భేషజాల నుంచి పదముల వైపు తిప్పినదేమో అనిపిస్తుంది. క్షేత్రయ్య కర్ణాటక సంగీత వికాస కాలములో భేషజాలు లోపించి మాధుర్య మకరందము చిందించే శుభ సమయానికి ఉషస్సు వంటివారు. సాహిత్యము ఒక్కొక్క చోట సభలలో వినిపించరానంత లాలసను తరచు భరిస్తున్న సంగీత మాధుర్యము ఆగండాశ్మములను ముంచి నిండుగా ప్రవహిస్తుంది క్షేత్రయ్య పదాలలో. అవి ఇక్షుఖండాలు. సాహిత్యము కాదు వాటి జీవము, మరి సంగీత మధుర రసము. తన పద కవితలో ఒక నూతన అభినయ కళాసృష్టి చేసి దేవదాసీల అభినయ కళపై ఒక నూతన వెలుగును ప్రసరించి, అమరమూర్తి అయినాడు క్షేత్రయ్య."

"ఈ రాగ తాళములు రెంటిని కలిపి, హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పూర్ణ స్వరూపము. దాని పూర్ణానుభవమును మనకపుడే, ప్రకృతి విషయమైన క్షేత్రయ్య పదము, కవిత్వము, రాగ తాళములను పరస్పర సౌహార్దముతో కలసి తయారైన నిండు రచన."

– రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

## ఆధార గ్రంథాలు :


★ ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము – బాలాంత్రపురజనీ కాంతారావు

★ ఆంధ్ర విశ్వకళాపరిషత్ భాషా సాహిత్యసేవ – (అముద్రితం) వెలమల సిమ్మన్న

★ కీర్తనాకౌముది – పొన్నా లీలావతి

★ క్షేత్రయ్య – ఎస్. గంగప్ప

★ క్షేత్రయ్య పదములు – విస్సా అప్పారావు

★ క్షేత్రయ్య పదములు – సం|| మంచాళ జగన్నాథం

★ తెలుగులో పదకవిత – ఎస్. గంగప్ప

★ తెలుగు సాహిత్య చరిత్ర – వెలమల సిమ్మన్న

★ తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు – వెలమల సిమ్మన్న

# సారంగపాణి పద సాహిత్యం



ఆచార్య ఎస్. గంగప్ప

పదకర్తల్లో క్షేత్రయ్య తరువాత పేర్కొనదగినవాడు సారంగపాణి (1680–1750) చిత్తూరు మండలంలోని కార్వేటినగర ఆస్థాన వాగ్గేయకారుడు. సారంగపాణి పదాలు మొదట కార్వేటి నగరం భారతీ లీలా సదన ముద్రాక్షరశాలలో ప్రకటింపబడ్డాయి. తర్వాత 1867, 1978 సంవత్సరాల్లో ముద్రితమయ్యాయి. 1963లో పురిపండా అప్పలస్వామి గారి సంపాదకత్వంలో వెలువడ్డాయి. 'సారంగపాణి పద సాహిత్యం' అనే గ్రంథాన్ని ఈ వ్యాస రచయిత ఆచార్య ఎస్. గంగప్ప తి.తి.దే వారి ఆర్థిక సహకారంతో ముద్రించాడు.

సారంగపాణి ప్రతిభావంతుడైన వాగ్గేయకారుడు. 'త్యాగయ్యకున్న సర్వతో ముఖ ప్రతిభకానీ, కంచెర్ల గోపన్నగారి కున్న భక్తి తాదాత్మ్యం కానీ సారంగపాణికి లేకపోయినా, భక్తికి తగిన భావన, భావనకు తగిన భాష ఒకదానికొకటి తులతూగుతూ సారంగపాణి భక్తి వైరాగ్య కీర్తనలు చాలా హృదయంగమంతా ఉంటాయి" అని మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు అభిప్రాయాన్ని వెల్లడించారు. కానీ ఇక్కడ మనం ఒక్క విషయం గమనించాలి. భక్తి భావనలో త్యాగయ్య రామదాసులతో ఇతర వాగ్గేయకారుల్ని పోల్చటానికి వీల్లేదని నా భావన. వీరిద్దరూ ఆ జన్మ శ్రీరామ భక్తాగ్రేసరులు. సారంగపాణి క్షేత్రయ్యలాగా మొదట రక్తి కలిగి ఆ వెనుక భక్తి వైరాగ్యాలను ప్రకటించాడు. అంతేగాక సారంగపాణి కీర్తనల్లో వైవిధ్యం ఉంది. అయితే త్యాగమయ్య కృతులకు, రామదాసు కీర్తనలకు ఉన్నత ప్రచారం సారంగపాణి కీర్తనలకు లేని విషయాన్ని మనం గుర్తించవచ్చు. సారంగపాణి నవ విధ భక్తుల్ని వైరాగ్య కీర్తనల్లో ప్రకటించాడు. ఆయన ఇష్టదైవం వేణుగోపాలుడు.

**"వేణుగోపాలుని విడూవము - మరి**
**వేరేవక్కరి పేరు నుడువము**
**పతిత పావనుడే మాకు చుట్టము**
**గోప బాలుని భజనె దిట్టము.**

తెలుగులో సంకీర్తన సాహిత్యం సింహగిరి నరహరి వచనాలు రచించిన కృష్ణమాచార్యులతో ప్రారంభమైంది. ఈయన తర్వాత పేర్కొనదగిన వారు యాగంటివారు, వారి పదాలు, వచనాలు పామర ప్రజల్లో బహుళ ప్రచారంలో ఉండేవి. తర్వాతి కాలంలో పోతులూరి వీరబ్రహ్మంగారు, వారి శిష్యుడు దూదేకుల సిద్ధయ్య తత్త్వాలు ప్రచారంలోనికి వచ్చిన విషయం అందరికీ తెలిసిందే.

తెలుగు పదసాహిత్యంలోకి 15వ శతాబ్దం వసంతకాలం. తెలుగు పద కవితకు ఆద్యుడు తాళ్ళపాక అన్నమయ్య. అందుకే ఆయన పద కవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధి పొందాడు. ఈయన పుత్ర పౌత్రులు కూడా పద సాహిత్యాన్ని వెలువరించారు. అన్నమయ్య 32 వేల సంకిర్తనలు రచించినట్లు చెప్పబడుతున్నా ఆయన రచనలుగా 13వేలు మాత్రమే లభిస్తున్నాయి. ఇవి శృంగార, ఆధ్యాత్మిక అని రెండు విభాగాలుగా ఉన్నాయి. సంస్కృతంలో 'సంకీర్తన లక్షణము' రచించినట్లు చెప్పబడుతున్నా అది లభించటం లేదు. అయితే దానికి తెలుగు అనువాదంగా అన్నమయ్య మనుమడు చినతిరుమలాచార్యుడు రచించిన 'సంకీర్తన లక్షణము' లభించటం విశేషం. చిన తిరుమలాచార్యుడు రచించిన సంకీర్తన లక్షణములో 'పద' నిర్వచనం ఉంది.

**భరతాదుల గ్రంథంబుల**
**విరచించిన లక్షణములు వేంకట భూమీ**
**ధరవర కీర్తన లక్ష్యము**
**లురుపద కవితా పితామహుండేర్పఱచెన్" 10**
**పదమగు సుప్తి ఙ్ఞంతము**
**పదమవయవ, మవయవి యును, బదమన బరగున్**
**దుది నీ తెఱంగులన్నియు**
**బదకవితా మార్గ సార్వభూముడు దెలిపెన్" 11**
**పదములు శృంగారబధూ**

**మృదుమధుర మనోజ్ఞ వాక్యమిశ్రములైనన్**
**విదితార్థగ్రామ్యోక్తులు**

పదిలముగా బొంకమొటిగి పలుకగజెల్లున్12....." అంటూ పదనిర్వచనం గావించాడు.

అన్నమయ్యసంకీర్తనల్నిగూర్చిఆయనమనుమడు చినతిరుమలాచార్యుడు

**"పావనములు హరిభక్తిని**
**భావనములు సర్వమంత్రపరమ రహస్యో**
**ద్భావనములు గాయక, నిక**

రావనములు తాళ్ళపాక అన్నయ పదముల్ (3) అని సంకీర్తన లక్షణములో పేర్కొన్నాడు.

అన్నమయ్య సంకీర్తనములు శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనములని రెండురకాలు. ఏ సంకీర్తనను గమనించినా అన్నమయ్య అంతరంగం భక్తిభావ ప్రబోధమే. అలమేల్మంగా శ్రీనివాదుల మహిమాభి వర్ణనమే అన్నమయ్య

**"పలికింతువు అక్షరముల పరగనవే వ్రాయింతువు**
**వెలయుగ నీవే వెలిగా వేరొకటి నే| జేయ 'జుమీ' (2-269)**

అని భగవంతుడే తనచేత సంకీర్తనలు చెప్పించాడని, ఆ దేవదేవుని విషయాన్ని గాకుండా ఇతర విషయాల్ని ప్రస్తావించనని పలకటమే కాకుండా అన్నమాటను నిలబెట్టుకొన్న అపరభక్త శిఖామణి అన్నమయ్య. ఆయన సంకీర్తనల్లో నాయికానాయకులు, సంయోగ వియోగ శృంగారాలు, రాయబారాలు, సంవాదాత్మకాలు, దశావతారాలు, జానపద గేయ ధోరణులు, దేవుడుజీవుడు, ఆత్మ, పరమాత్మ మొదలైనఅనేకఅంశాలుప్రస్తావితమయ్యాయి.

అన్నమాచార్యుడు, ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యుడు, ఆయన ప్రియపుత్రుడు చిన తిరుమలాచార్యుడు తాళ్ళపాక పద కవిత్రయంగా ప్రసిద్ధి పొందారు. పెద తిరుమలాచార్యుడు శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలు, వేంకటేశ్వర వచనాలు, శృంగారదండకం, వేంకటేశ్వరోదాహరణం, నీతిసీస శతకం, సుదర్శనరగడ, సంకీర్తన లక్షణ వ్యాఖ్య, శ్రీ వేంకటేశ్వర ప్రభాతస్తవం మొదలైన రచనలు చేశాడు.

చినతిరుమలాచార్యుడు కూడా శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనములు రచించాడు. చిన తిరుమలయ్య అష్టభాషా దండకాన్ని కూడా రచించాడని చెప్పటం వల్ల ఆయన బహు భాషా పాండిత్యం స్పష్టమవుతున్నది. చినతిరుమలయ్య అన్నమయ్య మార్గాన్ని అనుసరించి సంకీర్తన రచన గావిస్తూ ఏ సంకీర్తనలోనూ వెంకటనాథుని ముద్రను వీడలేదు. వివిధ క్షేత్రాల్లో వెలసిన వైష్ణవమూర్తుల్ని వర్ణించాడు. ఈ విధంగా తాళ్ళపాక పదకవిత్రయం, పద సాహిత్యానికి విశిష్ట సేవకావించిరి. తాళ్ళపాక వారి సాహిత్య ప్రచురణ, ప్రచారాలను నిర్వహిస్తూ తి.తి.దే వారి కృషి ప్రశంసనీయం.

సారంగ పాణి పదాల్లో పైకి లౌకిక శృంగార భావనలు కనిపించినా భాగవతా గోపికా మధురభక్తి ఛాయలు గోచరిస్తాయి.

**"కులకాంతలు విడివడినలు దిక్కులు**
**చెలరేగిందేటి పాపమో అయితే (పల్లవి)**
**వెలయాండ్లకు జీవన మేమిక శ్రీ**
**వేణుగోపాలా సంకరమై (అ.ప)**
**ఉగదెలియని బిడ్డలనెడబాసి - వృన్నమూలముంత దాటవేసి**
**మగనిపేరు కారాదని రోసి - మ్నన్నెకాపురము వ్యర్థము చేసి (కుల)**

**తల్లిదండ్రుల మది తల్లడబెట్టె - తమజాతులకపకీర్తి జుట్టె**
**తలపరాని నిందల కొడిగట్టె - ధర్మశాస్త్రముల రోచికబుట్టె (138)**

అని ప్రతిభావంతంగా రచించాడు. ఇంతేకాకుండా ఈ పదం క్షేత్రయ్య మధురభక్తి ప్రాధాన్యం గల ప్రసిద్ధ పదం

**"చూడరె అది నడిచే హొయలు**

కూడునటే అది మనిషా మ్రాకా" అనేదాని గుర్తుకుతెస్తుంది. కొంతవరకు సారంగపాణి పదం దీనిలోని మధుర భక్తిఛ్ఛాయల్ని తెల్పుతుంది.

అన్నమయ్య శృంగార ఆధ్యాత్మిక కీర్తనలు రచించగా, క్షేత్రయ్య శృంగారపదాల్ని మాత్రమే రచించాడు. సారంగపాణి శృంగారపదాలతో పాటు కీర్తన రచన చేసి అందులో భక్తి, వైరాగ్యం, వేదాంతం, ఆధ్యాత్మిక చింతన,

తాత్త్విక చింతన మొదలైన విషయాలను వివరించి లౌకిక విషయాల్ని తెలిపి, మంచిని పెంచుకోవాలని మానవాళికి నీతి ప్రభోదం చేశాడు. సారంగపాణి లోకాన్ని బాగా పరిశీలించాడు. అనుభవాన్ని గడించాడు. అందుకే "భక్తిలేని పూజ అనవసరమనీ", "జీతముముట్టని కొలువేమిటికి (180) అని చెప్పాడు. ఇంకా "గుత్తలంజలను మరిగిన వారికి (191) కలిగే పర్యవసానాన్ని "పోరానితావుకు పోరాడు బుద్ధిమంతుడైతే (181) అనిచెప్పి "కడుపా నీవంత ఘనమైతివా.... కోటివిద్యలు నీ కొరకే గదవే (192) అని అనేక జీవిత సత్యాలను వివిధ రీతులుగా వివరించాడు. "పాపాత్ముల కెక్కడదీకాలము" (103) అంటూ పాపాత్ముల పాపపు కార్యాలను తెలిపి "దాతను వాజులు జరిపే దబ్బరి కలమీదనె సొడు (167) అంటూ ఏదోవంక జూపి తప్పించుకోవటం ఉత్తమలక్షణం కాదని నిరూపించి "మంచివాడనుచు కీర్తి వహించే మానవుడే ఘనుడు" (171) అని మంచివాడుగా మారటానికి కావలసిన సమస్త విషయాలు వివరించి "భక్తితో పిలిచి పెట్టిన మన్నము పట్టెడైనా చాలు" (176) అంటూ అంతశ్శుద్ధి, ఆత్మసంతృప్తి ప్రధానమని ప్రబోధించాడు. "అక్షయపాత్రకు పోతే కలదని వొక భిక్ష వేయరయ్యా" (194) అనే పదంలో అక్షయ పాత్రతో భిక్ష మొత్తుకొని జీవించే సర్వసంగ పరిత్యాగుల్ని లెక్కచేయని దుష్టుల ధౌష్ట్యాన్ని మిక్కిలి గర్హించాడు సారంగపాణి.

భక్తి, వేదాంతం, వైరాగ్యం, ఆధ్యాత్మిక చింతన, తాత్త్విక చింతనలను చక్కగా సారంగపాణి వివరించాడు. "హరి తానే వున్నాడన్నిటికీ, మే వెరపు లేదిక మాకు" (189) అని అంతటికీ ఆ పరమాత్ముడని వివరించాడు. ఇంకా-

**"అద్దెకొంపవంటిదీ దేహం**
**మనిత్యమే మనసా (పల్లవి)**
**మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్ళు సు**
**మీ వేణుగోపాలుని సాక్షిగా (అ.ప)**
**బందెగొడ్లవంటిది సంసారము**
**భ్రమయకే మనసా**
**యెవరున్నా నడమంత్రమె జీవుని**
**కెవరులేరు ముమ్మాటికి (అద్దె)**

**పువ్వువంటిది యౌవనమనగా**
**పాలాకే మనసా**
**నవ్వుగాదు సిరులు మెరుపువంటివి**
**నమ్మకే మనసా మువ్వాటికి (అద్దె) (ప. 190)**

అని శరీరమనిత్యమన్న సత్యాన్ని హృదయానికి హత్తుకొనేటట్లు నీతి వైరాగ్యాల్ని సారంగపాణి ప్రబోధించాడు.

సారంగపాణికి లోకజ్ఞత విస్తారంగా ఉంది. లోకంలోని మనుషుల తత్త్వాన్ని బాగా పరిశీలించాడు. ప్రతి విషయాన్ని పరిశీలనగా చూశాడు. అందుకే తన పదాలకు సామాజికతను జోడించి రచించాడు. కాబట్టి అవి సార్వకాలికములుగా, సార్వజనీనములుగా ఉన్నాయి. కొన్ని పదాలనే రచించినా విస్తృతమైన కీర్తిని మూట గట్టుకొన్న విశిష్ట వాగ్గేయకారుడు సారంగపాణి.



సారంగపాణిపై ఎందరో వాగ్గేయకారుల ప్రభావం పడింది. కానీ క్షేత్రయ్య, సారంగపాణి పదములు అర్థం, భావం, భాషలో ఎంతో దగ్గరగా కవల పిల్లలలాగా ఉంటాయి. అలాగే, సారంగపాణి పదములు వేణుగోపాలునికి అంకితం, క్షేత్రయ్య పదములు మువ్వగోపాలునికి అంకితం. మరి కాల ప్రవాహంలో లేఖకులు చేసిన పొరపాటో, నర్తకులు చేసిన తేడానో తెలియదు. కొన్ని పదములు క్షేత్రయ్య మరియు సారంగపాణి, ఇద్దరి పదములలో కలిసిపోయాయి. ఇది నిర్దిష్టంగా, నిర్ధుష్టంగా ఎవరు రాశారో తెలియటంలేదు.

– డా. శ్రీలేఖ కొచ్చెర్లకోట.

# అన్నమయ్య సంకీర్తనల్లో ఆచార వ్యవహారాలు



● ఆచార్య పేట శ్రీనివాసులు రెడ్డి
✆ 98493 07333

భారతదేశంలో చెప్పుకోదగ్గ వాగ్గేయకారుల్లో తాళ్ళపాక అన్నమయ్య ఒకరు. తెలుగు సాహిత్యంలో ఈయన పదకవితా పితామహుడుగా పేరుగాంచారు. ఈయన 32000 సంకీర్తనలు రాసి కీర్తి గడించారు. అయితే దురదృష్టవశాత్తు చాలా సంకీర్తనలు కాలగర్భంలో కలిసిపోయి మనకు ప్రస్తుతం 13,724 మాత్రమే లభిస్తున్నాయి. అన్నమయ్య సంకీర్తనల్లోని ఆచారాలు సంప్రదాయాలన్నీ రాయలసీమకు చెందినవే. ఇంకా చెప్పాలంటే నేటి అన్నమయ్య జిల్లాలోని తాళ్ళపాక గ్రామానికి, తిరుపతికి చెందినవే. అన్నమయ్య బాల్యంలోనే తిరుపతికి చేరుకొని నివసించడం వల్ల ఆయన సంకీర్తనల్లోని విషయాలన్నీ తిరుపతి దాని పరిసరాలకు చెందినవిగానే భావించాలి.



సింధునదీ నాగరికతలో హరప్పా, మొహంజదారోలు చెప్పుకోదగ్గవి. ఆర్యులు యుద్ధోపజీవులు, ఇరాన్, ఇరాక్ ప్రాంతాల నుండి వాళ్ళు గుర్రాలపై వలస వస్తూ ఆవుల్ని, గొర్రెల్ని మేపుతుండేవారు. సింధునదీ నాగరికత ప్రపంచంలోనే అత్యంత ప్రాచీనమైంది. ద్రావిడ సంస్కృతీ, ఆచారాలు,

సంప్రదాయాలతో కూడుకొన్నది. ఆర్యులు గుర్రాలపై ఎక్కి యుద్ధం చేసేటప్పుడు, శాంతి కాముకులైన ద్రావిడులు పదాతి దళాలను కలిగి యుద్ధం చేసేవారు. ఎత్తులో ఉండి యుద్ధం చేసేవారికే విజయావకాశాలు ఎక్కువ. అలా ద్రావిడులు ఆర్యులతో యుద్ధంలో గెలువలేక తిన్నగా దక్షిణ భారతదేశానికి వలసలొచ్చి, ఇక్కడుండే గిరిజన తెగలతో మమేకమై స్థిర నివాసాలేర్పరచుకొన్నారు. మళ్ళీ ద్రావిడుల ఆచారాలు సంప్రదాయాలు కొంచెం రూపాంతరం చెందినా మూల ఆచారాలు, సంప్రదాయాలు మాత్రం అలాగే ఉండిపోయాయి. ఆచారాలంటే ఒక సంఘంలోని ప్రజలు తరతరాలుగా పాటించే పద్ధతుల్ని ఆచారాలంటారు. ఈ ఆచారాలు స్థిరంగా ఉండాలనే నియమమేమి లేదు. ఉన్న ఆచారాలు మాసిపోయి, సరికొత్త ఆచారాలు పుట్టొచ్చు. ఈ కొత్త ఆచారాలు రానురాను కాలక్రమంగా తర్వాతి తరాల వాళ్ళల్లో ప్రబలంగా వేళ్ళూనుకోవచ్చు. ఆయా సంఘాలలోని వ్యక్తులు ఆచారాలను ఉల్లంఘించడానికి సాహసం చేయలేరు. ఆచారాలను ఆయా సంఘాలలోని జనాలు తప్పకుండా పాటిస్తారు.

అన్నమయ్య సంకీర్తనల్లో ఎన్నో ఆచార వ్యవహారాలు చోటు చేసుకొని ఉన్నాయి. ఆ ఆచార వ్యవహారాలు ఇప్పటికీ ఆచరింపబడుతున్నాయి.

**1. పూజలు - ఆరాధన - ఉత్సవాల ఆచారాలు :** అన్నమయ్య సంకీర్తనల్లో వేంకటేశ్వర స్వామి పూజా విధానం, ఆరాధనా పద్ధతులెన్నో చోటు చేసుకొని ఉన్నాయి. తిరుమలేశుని ఆలయంలో తరతరాల నుండి వస్తున్న ఆచారాలను తన సంకీర్తనల్లో ఆయా సందర్భాలలో ప్రస్తావించాడు. షోడశ కళానిధి అయిన వేంకటేశ్వర స్వామికి షోడశోపచారాలని, అర్ఘ్యపాద్యాచమనాలని, మజ్జనమని, వర పీతాంబరునికి వస్త్రాలంకారమని, సరి శ్రీమంతునికి భూషణమనాలని, శ్రీవారికి గంధ పుష్పధూపాలని, కోటి సూర్యతేజునికి దీపమని, నైవేద్యాలని, కప్పుర విడెములని, ప్రదక్షిణాలు, దండాలు స్వామి వారికని తన సంకీర్తనలో అన్నమయ్య పేర్కొన్నాడు. గమనించండి–

"షోడశ కళానిధికి షోడశోపచారములు
జాడ తోడ నిచ్చలును సమర్పయామి
అలరు విశ్వాత్మకున కావాహన మిదె

సర్వ నిలయున కాసనము నెమ్మినిదె
అలగంగా జనకున కర్ఘ్య పాద్యాచమనాలు
జలధి శాయికిని మజ్జనమిదే
వరపీతాంబరునకు వస్త్రాలంకారమిదె
సరి శ్రీమంతునకు భూషణములివే
ధరణీ ధరునకు గంధ పుష్ప ధూపములు
తిరమిదె కోటి సూర్య తేజునకు దీపము
అమృత మథనునకు నదివో నైవేద్యము
గమి (రమి) జంద్రునేత్రునకు కప్పురవిడెము
అమరిన శ్రీవెంకటాద్రి మీద దేవునికి
తమితో ప్రదక్షిణాలు దండములు నివిగో"

శ్రీవారి సన్నిధిలో నిరంతరం ఉంటూ ఎన్నో నిత్య పూజలను, వారోత్సవాలను, వార్షికోత్సవాలను కన్నులారా కాంచి అన్నమయ్య ఎన్నో కీర్తనలను రచించాడు. తిరుమల శ్రీవారికి ప్రతి శుక్రవారం అభిషేకం జరుగుతుంది. ఇది ఇప్పటికీ గుడిలో ఆచారంగా కొనసాగుతోంది. వేంకటేశ్వర స్వామి అభిషేకానికి ఆకాశగంగ నుండి తాతాచర్యుల వంశీకులు నేటికీ బిందెలకొద్ది నీళ్ళను తెస్తుంటారు. అన్నమయ్య తన సంకీర్తనల్లో అభిషేకానికి ఏమేమి వాడుతారో తెలిపాడు. శ్రీవారి అభిషేకంలో పన్నీరు, కప్పురధూళి, పుణుగు వంటి సువాసనా భరితమైన వస్తువులను ఎందుకు వాడుతారో కూడా ప్రస్తావించాడు. కింది సంకీర్తనను గమనించండి.

"పదియుఁ బదియుఁగాను పరమాత్ముఁడితనికి
వెదకి చవులు దెచ్చి విందులిట్టేసేయరే
పొలసుపైఁ బారనట బురద మేనంటెనట
యిల మన్ను మోఁచెనట యీ దేవుఁడు
నెలవైక రాకాసి నెత్తుటఁదోఁగి నాఁడట
కల పన్నీరెల్ల బోసి కడుగరే దేహము
బాఁపన జిడ్డంటెనట పట్టెనట ముమ్మరము
కైపగు నల్లని కోక గట్టి నాఁడట
చాపలానఁ జెంచుదాని సంగతిఁ దిరిగెనట
కోపులఁగప్పుర ధూళి గుప్పరే యీతనికి
కాంతలనే కూడెనట కడగడ దొక్కెనట

**పొంతలఁ దట్టు పుణుఁగు పూయరే నేడు**
**యింతట శ్రీవేంకటేశు నెద నలమేలు మంగఁ**
**గాంతునికి మెడఁగుచ్చి కట్టరే మొక్కుదము"**

తిరుమల వెంకటేశ్వరస్వామికి అన్నింటి కన్నా ప్రసిద్ధమైంది సాలకట్ల బ్రహ్మోత్సవాలు. తిరుమలలో జరిగే బ్రహ్మోత్సవాలను తిలకించని భక్తుడుండడంటే అతిశయోక్తి కాదు. బ్రహ్మోత్సవాలు ఎన్నో వందల సంవత్సరాల నుండి ఆచారంగా వస్తోంది. స్వయంగా బ్రహ్మ దగ్గరుండి ఈ బ్రహ్మోత్సవాలను నిర్వహిస్తాడని ప్రజల నమ్మకం. ఈ బ్రహ్మోత్సవాలు తొమ్మిదిరోజుల పాటు జరుగుతుంది. తిరుమల బ్రహ్మోత్సవాలు ధ్వజారోహణతో ప్రారంభమై, ధ్వజావరోహణతో ముగుస్తుంది. బ్రహ్మోత్సవాలలో శ్రీవారు అనేక వాహనాలపై ఊరేగుతాడు. చివర్లో చక్రస్నానం ఉత్సవంతో బ్రహ్మోత్సవాలు ముగుస్తాయి. తాళ్ళపాక అన్నమయ్య కూడా ఈ బ్రహ్మోత్సవాలను కళ్ళకు కట్టినట్లు తన సంకీర్తనల్లో రచించాడు. కింది సంకీర్తనను గమనించండి

**"తిరు వీధుల మెఱసీని దేవదేవుడు**
**గరిమల మించిన సింగారముల తోడను**
**తిరు దండెలపై నేగి దేవుడిదే తొలినాడు**
**సిరులు రెండవనాడు శేషుని మీద**
**మురిపేన మూడోనాడు ముత్యాల పందిరి క్రింద**
**పొరి నాలుగోనాడు పువ్వు కోవిల లోను**
**గక్కన ఐదవనాడు గరుడుని మీద**
**ఎక్కెను ఆరవనాడు యేనుగు మీద**
**చొక్కమై ఏడవనాడు సూర్య ప్రభలోనను**
**యిక్కున తేరును గుర్ర మెనిమిదో నాడు**
**కనకపుటందలము కదిసి తొమ్మిదోనాడు**
**పెనచి పదోనాడు పెండ్లి పీట**
**ఎనసి శ్రీవేంకటేశుడింతి అలమేల్మంగతో**
**వనితల నడుమను వాహనాల మీదను"**

బ్రహ్మోత్సవాలలో శ్రీవారి ఉత్సవ మూర్తి మలయప్ప స్వామి వారు శేష, ముత్యాలపందిరి, పుష్పపల్లకి, గరుడ, గజ, సూర్యప్రభ, తేరు, అశ్వవాహనం,

బంగారు రథాలపై ఊరేగుతారని అన్నమయ్య వర్ణించాడు. పదోరోజు పెండ్లి పీట అన్నాడు. అయితే నేడు ప్రతిరోజు స్వామి వారు పెండ్లి పీటెక్కి కళ్యాణం చేసుకొంటున్నాడు.

**2. కళలు :** కళలు కూడా అనాదిగా తెలుగు వారిలో వేళ్ళూనుకొని ఉన్నాయి. ఇప్పటికీ చాలా కళలు మన పూర్వీకుల నుండి సంక్రమించడంతో మనం వాటిని ఆచరిస్తున్నాం. అవి ఒకరకంగా మనకు వారసత్వాలనే చెప్పాలి. కళలను అనేకమంది అనేక రకాలుగా వర్గీకరించారు. కొందరు స్థిర కళలు, చర కళలన్నారు. కొందరు శ్రవ్య కళలు, దృశ్య కళలన్నారు. కొందరు కళలు 64 అన్నారు. కొందరు ప్రాయోజిత కళలు, ప్రదర్శన కళలన్నారు. ఈ ప్రదర్శన కళలను సంగీత ప్రధానమైనవి, నృత్య ప్రధానమైనవి, రూపక ప్రధానమైనవి, వివిధాలు అని విభజించారు. సంగీత ప్రధానమైన కళల్లో గాత్ర, వాద్య సంగీతాలున్నాయి. గాత్ర సంగీతం మొత్తం సంకీర్తనలకు అన్వయిస్తుంది. అలాగే అన్నమయ్య ఆనాడు అనేక వాద్యాలను వాయించే ఆచారాలున్నట్లు ఆయా సందర్భాలలో పేర్కొన్నాడు. ఇక నృత్యకళల్లో అన్నమయ్య గొబ్బి, తందాన, కోలాటం, డప్పు నృత్యంలో భాగమైన ఏలలు వంటి వాటిని ప్రస్తావించాడు.

**2.1. గొబ్బి :-** గొబ్బి పాటలను సంక్రాంతి నెలలో అంటే ధనుర్మాసంలో ప్రతి ఊరిలోనూ ఆడపడుచులు పాడుతూ, గొబ్బెమ్మ చుట్టూ నృత్యం చేస్తారు. గొబ్బెమ్మను గోమయంతో చేసి పూలతో అలంకరిస్తారు లేదా ముగ్గుల మధ్య గోమయంతో గోపురంలా తయారుచేసి గుమ్మడి పూలు, తంగేడూ పూలతో అలంకరిస్తారు. స్త్రీలు వృత్తాకారంగా చేరి చేతులు చరుస్తూ, ముందుకు, వెనకకు కదులుతూ, వృత్తాకారంగా తిరుగుతూ గొబ్బిపాటలు పాడ్తారు. ఒకరు పాట పాడితే మిగిలిన వారు వంత పాడ్తారు. అన్నమయ్య రచించిన ఒకే ఒక గొబ్బి పాటను గమనించండి.

"కొలని దోపరికి గొబ్బిళ్ళోయదు
కులము స్వామికిని గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండక శిశువుకు - గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యుల కెల్లను తల

**గుండు గండనికి గొబ్బిళ్ళో**
**పాపవిధుల శిశు పాలుని తిట్ల**
**కోపగానికిని గొబ్బిళ్ళో**
**యేపున గంసుని యిడుమల బెట్టిన**
**గోప బాలునికి గొబ్బిళ్ళో"**

**2.2 కోలాటం :–** కోలాటం దేశమంతా అనేక పేర్లతో పిలువబడుతోంది. ఆడబడుతోంది. ముఖ్యంగా కోలాటం చాలా వందల సంవత్సరాల నుండి ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడుతోంది. తిరుమల, తిరుపతి దేవాలయాల శిల్పాలలో, చంద్రగిరి కోట దేవాలయ రాతి శిల్పాలలో కోలాటం వేస్తున్న స్త్రీల భంగిమలనుమనంచూడొచ్చు. అన్నమయ్యకాలానికికోలాటంబహుళవ్యాప్తిలో ఉండటం వల్ల అన్నమయ్య తన సంకీర్తనల్లో కోలాటం పాటలను రచించాడు. ఉదాహరణకు కింది కోలాటం పాటను గమనించండి.

**"వేడుక వసంతము వేళనిదే**
**వాడల వాడల వెంట వనిత లాడేరు**
**కేలు గేలు జుట్టి పట్టి కెందామర మోములెత్తి**
**కోలఁగోల దాఁక జేసి గుంపు వాయక**
**చాలుకొని యిద్దరేసి జంటలై సతులు గూడి**
**వోలి వేరొకతె కోల నొడ్డుతా నాడేరు**
**పాలిండ్లు గదలఁగ బరువైన తురుముల**
**చీలుచు పోలుచుఁగొంత వెనుకకును**
**మేలిమి పిఱుఁదులతో మెరయుచు మురియుచు**
**కోలలఁ బెడ మరలి కోలాటమాడేరు"**

**2.3. డప్పు నృత్యం :–** అన్నమయ్య కాలంలోనే కాకుండా నేడు కూడా డప్పు నృత్యం అంతటా ఉంది. ముఖ్యంగా తిరుపతి గంగ జాతర సమయంలో డప్పు వాయించి ఏల పాటలు పాడి ఆ తర్వాత నృత్యం చేయడం ఆచారంగా వస్తోంది. ముందున్నంత ఉధృతి లేకపోయినా ఇప్పటికీ పలకల అడుగుల పేరుతో తిరుపతిలో డప్పు నృత్యముంది. ఏల పాటల్ని పలకల పడుగుల్లోనే కాకుండా తిరుపతి పరిసరాల్లో కపిల తోలేటప్పుడు కూడా కాయకష్టాన్ని మరచిపోయేందుకు జానపదులు పాడుకొనేవారు. అన్నమయ్య ఒకే ఒక ఏల

పాటను రచించాడు. ఆ పాటను గమనించండి.

"మేడలెక్కి నిన్ను జూచి - కూడేననే యాసతోడ
వాడుదేరి వృస్సురందురా - వెంకటేశ
యాడ నుండి విందాఁ కానురా
నిండ బూచిన మానిపై గుండు గోవిలా గూయుగా
నిండిన నీ యెలుగంటాను వేంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా...."

**3. ఆటలు** :- తెలుగువారికి ప్రత్యేకించి ఆంధ్రులకు ఎన్నో ఆటలు తరతరాల నుండి ఆచారంగా వస్తున్నాయి. ఒకతరం వారు మరో తరం వారికి మన సంప్రదాయ ఆటలను నేర్పడం వల్ల ఇవి ఇంకా ప్రజల్లో నిలిచే వున్నాయి. విదేశీ ఆటల మోజులోపడి, సెల్ ఫోన్ ఆటల మాయలో పడి నేడు పిల్లలు మన సంప్రదాయ ఆటలను ఆడడం లేదు. అన్నమయ్య తన కాలం నాటి ఆటలను తన సంకీర్తనల్లో సందర్భోచితంగా ప్రస్తావించాడు.

**3.1. గుజ్జనగూళ్ళు** :- ఆడపిల్లలు కానీ, ఆడపిల్లలతో కలసి మగపిల్లలు కానీ బుడిగెలు తీసుకొని పెద్దలు వండినట్లు బియ్యం ఉడకపెట్టి అందులో బెల్లం వేసి గుజ్జనగూళ్ళు వండి, ఆ తర్వాత చిన్న చిన్న ఆకుల్లో పెట్టుకొని తింటుంటారు. ఇదొక ఆట. అన్నమయ్య తన సంకీర్తనల్లో గుజ్జనగూళ్ళను గురించి పేర్కొన్నాడు.

"కోమలపుఁ బులకలె కూరిమి గుజ్జనఁ గూళ్ళ"
"పొలసి గుజ్జన గూళ్ళు బువ్వలాడే నన్నుఁ జూచి
నలువంక నాఁడు నీవు నవ్వితివి గదరా"

**3.2. చిందులాట** :- చిందులేస్తూ ఆడే ఆటను చిందులాట అంటారు. అభినయిస్తూ దానికి అనుకూలంగా ఆటపాటలు చిందులాటలో ఉంటాయి. అన్నమయ్య ప్రస్తావించిన చిందులాటను చూడండి–

"చిందులకు నాడేటి సీమంతినీ మణులు
చలఁగి యిరుగడఁగాను"
"చిందుల పాటల శిరిపాలయాటల
అందెల మోతల నాడెనదే"

**3.3. ఉయ్యాలాటలు :-** చిన్నపిల్లలు మొదలుకొని యువతుల వరకు పల్లెల్లో చెట్ల కొమ్మలకు ఉయ్యాలలను కట్టుగొని ఊగడాలను మనం చూడొచ్చు. అన్నమయ్య ఉయ్యాలలను ఎలా ప్రస్తావించాడో గమనించండి–

"వుయ్యాల మంచము మీద నుంచి వేసారితిమి
మయ్యు దించుకయు రెప్ప మూసినం దెరచును"
"ఓయి బామలాల ఉయ్యాలా
బామలందూనూ ఉయ్యాల"

ఇలా అన్నమయ్య వామన గుంటలు, జూదం, పూలిజూదం, దాయాలాట, ఇసుకగూళ్ళు, బొమ్మలాటలు, చెట్టాపట్టాలు, అచ్చనగండ్లు, బొమ్మల పెండ్లి వంటి ఆటలను గూర్చి తన సంకీర్తనల్లో ప్రస్తావించాడు. ఈ ఆటలన్నింటినీ పిల్లలు ఇప్పటికీ ఆచరిస్తూ ఆడుకుంటున్నారు.

**4. పెళ్ళిళ్ళు :-** తెలుగువారి పెళ్ళిళ్ళు ఎంతో ప్రత్యేకంగా ఉంటాయి. వైదిక మత సాంప్రదాయం ప్రకారం మనం పెండిళ్ళల్లో ఎన్నో ఆచారాలను పాటిస్తుంటాం. అన్నమయ్య తన సంకీర్తనల్లో ఎన్నో పెండ్లి ఆచారాలకు సంబంధించినవి రచించాడు. అన్నమయ్య సంకీర్తనల్లో ప్రస్తావించబడి ఉన్న పెండ్లి ఆచారాలను గమనించండి.

"పిడికిట తలంబ్రాల పెండ్లి కూతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లి కూతురు
పేరుకల జవరాలె పెండ్లి కూతురు పెద్ద
పేరుల ముత్యాల మెడ పెండ్లి కూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లి కూతురు విభుఁ
చేరుకుచ్చ సిగ్గువడీఁ బెండ్లి కూతురు
బిరుదు పెండెము పెట్టెఁ బెండ్లి కూతరురు నెర
బిరుదు మగని కంటెఁ బెండ్లి కూతురు
సిరిదూరి నవ్వుడె పెండ్లి కూఁతురు పతిఁ
జెర రేఁచీ నిదివో పెండ్లి కూఁతురు
పెట్టెనె పెద్ద తురుము పెండ్లి కూఁతురు నేఁడె
పెట్టెఁడు చీరలు గట్టెఁ బెండ్లి కూఁతురు

**గట్టిగ వేంకటపతి కౌగిటను వడి**
**పెట్టిన నిధానమైన పెండ్లి కూతురు"**

ఇలా అన్నమయ్య సంకీర్తనల్లో పెళ్ళిళ్ళలోని కట్నాలు, పెండ్లి కూతురు, పెండ్లి కొడుకుల అలంకరణలు, వచ్చిన పెండ్లి వారికి విడిది ఏర్పాట్లు, పెండ్లి పీట, మంగళాష్టకాలు, బాసికాలు, మంచి ముహూర్తం, కాలు తొక్కించడం, తాళి కట్టించటం, కంకణాలు ధరింపజేయడం, తలంబ్రాలు, అక్షింతలు, సేసబియ్యం, మంగళహారతులు, కొంగుముడి, విందు భోజనాలు, శోభనాలు వంటి ఎన్నో ఆచారాలను పేర్కొన్నాడు.

**5. వృత్తులు :-** మన దేశంలో అనేక కులాల వాళ్ళు అనేక వృత్తులను ఆచరిస్తూ జీవిస్తున్నారు. మన దేశంలో వ్యవసాయం ప్రధాన వృత్తి అయితే దానిని ఆధారంగా చేసుకొని అనేక వృత్తులు ఏర్పడ్డాయి. ఈ వృత్తులను ఆచరించడం వల్ల ఆయా కులాలు ఏర్పడ్డాయి. అన్నమయ్య తన సంకీర్తనల్లో ఆయా వృత్తులను ప్రస్తావించాడు. గమనించండి–

మన దేశంలోగానీ, ఆంధ్రప్రదేశ్‌లో గానీ అధిక సంఖ్యాకులు అంటే డెబ్బై శాతం మంది వ్యవసాయం మీదనే ఆధారపడి జీవిస్తున్నారు.

**"పంటల భాగ్యులు వీరాబాహు వ్యవసాయులు**
**అంటి ముట్టియిట్లఁగా పాడుదురు ఘనులు"**
**"తిమ్మిరెడ్డి మాకు నిచ్చె దిష్టమైన పొలము**
**బొమ్మిరెడ్డి కప్పగించి పోది సేసె బొలము"**

అలాగే వ్యవసాయానికి అనుబంధ వృత్తుల వారైన కమ్మరి, కంసాలి, కుమ్మరి, సాలె, చాకలి, వెట్టి, మంగలి, తలారి, పశువుల కాపరి, వడ్డె, దొమ్మరి, ఉప్పర వంటి వృత్తుల వారిని పేర్కొన్నాడు. వేశ్యావృత్తి, పాములనాడించేవారు, పూతపని, ఓడవ్యాపారం, సూదులమ్మేవారు, పాలు పెరుగమ్మేవారు వంటి ఇతర వృత్తుల వారిని గూర్చి కూడా అన్నమయ్య తన సంకీర్తనల్లో ప్రస్తావించాడు.

**6. ఆభరణాలు :-** ఆభరణాలు ప్రతి సంస్కృతిలోను తమ ఉనికిని చాటుకుంటూ, తమ ప్రత్యేకతల్ని నిలబెట్టుకొంటున్నాయి. ఒక్కో సంస్కృతివారు ఒక్కో రకమైన ఆభరణాలను వివిధ రకాలుగా ధరిస్తారు.

మన తెలుగు సంస్కృతిలోని ఆభరణాలు కూడా తరతరాల నుండి ఆచారంగా వస్తున్నాయి. మన ఆచారాలకు సంబంధించిన ఆభరణాలను అన్నమయ్య తన సంకీర్తనల్లో పేర్కొన్నాడు. అన్నమయ్య ప్రస్తావించిన ఆభరణాలను దిగున పొందుపరచడమైంది. గమనించండి–



చిరుగంటల మువ్వల గజ్జెలు, మొలనూళ్ళు, తీగ వడ్డణం, సూర్యచంద్రుల్లాంటి మొలపూసలు, ముత్యాల కుచ్చులు, సంకుచేరులు, ముత్యాల కంకణాలు, సంకు కడియం, సంధి దండలు, చేమ పూకడియాలు, ముంగ మురువులు, ఉంగరాలు, భుజకీర్తులు, కంకణాలు, గాజులు, బాహుపురి, పచ్చల పతకం, నల్లపూసలు, చెవిపోగులు, ముత్యాల కంఠసరులు, పగడాల దండలు, గురిగింజ పేరు, నీలమణి హారాలు, గజ్జెలు, మువ్వలు, అందెలు, మెట్టెలు, చంద్రాభరణాలు, బంగారు పెండరం, కంఠహారాలు, పతకాలు, ముత్యాలు, మాణిక్యాలు, తళుకు వజ్రాలు, కెంపులు, వైఢూర్యాలు, గోమేథికాలు, పద్మరాగాలు, వజ్రాలు, ఇంద్రనీలాలు. పుష్యరాగాలతో కూడిన ఆభరణాలు, బంగారంతో పాటు, వెండి, కంచు ఆభరణాలను కూడా అన్నమయ్య కాలం నాటి ప్రజలు ధరించేవారని అన్నమయ్య తన సంకీర్తనల్లో ప్రస్తావించాడు.

7. **ఆహారం :-** ఆహారం కూడా మన తెలుగు వారిలో తరతరాలుగా వస్తున్న ఆచారంగానే చెప్పవచ్చు. అనేక ప్రాంతాలలో అనేక ఆహార పద్ధతులున్న విషయం మనకు తెలిసిందే. ఉత్తర భారతదేశంలో రొట్టెలు ప్రధాన ఆహారం, అలాగే యూరపు దేశాల్లో కూడా గోధుమనే ప్రధాన ఆహారంగా తీసుకొంటారు. దక్షిణ భారతదేశంలో ప్రత్యేకించి తెలుగువారిలో వరి అన్నమే ప్రధాన ఆహారం. అన్నమయ్య సంకీర్తనల్ని పరిశీలిస్తే ఆనాటి నుండి ఉన్న ఆహారపు ఆచారాలు నేటికీ కొనసాగుతుండడం విశేషం.

అన్నమయ్య సంకీర్తనల్లోని ఆహారపు అలవాట్లను గమనించండి.

వరి అన్నం, బంగారు పళ్లెంలోని రాజన్నాలు, కొండలాగా రాశిగా పోసే దివ్యాన్నాలు. కూరలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, పచ్చళ్ళు, ఊరగాయలు, పేదలు తాగే అంబలి, అలాగే క్షీరాన్నం, దధ్యన్నం, మిళియపు తాళింపు, కారపు కూరలు, ఆవపచ్చడి, ఇక తినుబండారాలైతే చక్కెర మండిగలు, గారెలు, ఖర్జీకాయలు, పూర్ణ కుడుములు, నూనె కుడుములు, అరిసెలు, సుగినప్పాలు, ఇడ్డెనలు, ఇడ్డెన కుడుములు వంటి వాటినెన్నో పేర్కొన్నారు. అలాగే చిమ్మిలి, నువ్వులు, అటుకులు, చక్కిలాలు, పొడిబెల్లం, చారపప్పు, నానబెట్టిన శెనగలు, నానబియ్యాలు, తేనె, చక్కెర, కూటి గంజి వంటి వాటిని కూడా చిరుతిండ్లుగా ఉపయోగించే వారని అన్నమయ్య సంకీర్తనలను బట్టి తెలుస్తోంది. ఇప్పటికీ ఈ ఆహారపు అలవాట్లు మనకు ఆచారంగా ఉన్నాయి.

**8.పురుడు** :- ఇప్పటికీ తెలుగు వారు బిడ్డ పుట్టినప్పటి నుండి అనేక ఆచారాలను పాటిస్తుంటారు. అన్నమయ్య కూడా తన సంకీర్తనల్లో ఈ విషయాలను ప్రస్తావించాడు. బిడ్డ పుట్టిన పన్నెండవ రోజు ఉయ్యాల కట్టి దానిలో పడుకోబెట్టి లాలిపాటలను ఆడవాళ్లు పాడేవాళ్ళు. మాస, నక్షత్రాలను పాటించి బిడ్డకు పేరు పెట్టేవారు. జాతక అనుష్ఠానాలను నిర్వహించేవారు. బిడ్డ తండ్రి తాంబూలం, గంధాక్షతలు వచ్చినవారికిచ్చి పుత్రోత్సాహంతో ఆనందించేవాడు.

**9. వైద్యం** :- ప్రాచీన కాలం నుండి మన దేశీయమైన వైద్య విధానానికి ఎంతో పేరుంది. ఇంట్లో, ప్రత్యేకించి వంటింట్లో లభించే వస్తువులనే అధిక మోతాదుల్లో స్వీకరించి వైద్యం చేసుకొనేవారు. అన్నమయ్య కాలం నుండి, అంతకుముందు నుండి వైద్య విధానం మనకు ఆచారంగా వస్తోంది. అన్నమయ్య సంకీర్తనల్లో కనిపించే కింది వైద్యాన్ని గమనించండి–

అన్నమయ్య తన సంకీర్తనల్లో రోగాలకు మందులు, రసం, కషాయం, తైలం, ఇచ్చేవారన్నాడు. పుండుకు మందు పూసేవారని, రోజూ ఉడుకు నీళ్ళతో కడిగేవారని అన్నాడు. అలాగే చల్లకూడు పెట్టి కట్లు కట్టేవారని ప్రస్తావించాడు.

ఇలా అన్నమయ్య సంకీర్తనల్లో ఎన్నో ఆచార వ్యవహారాలు చోటు చేసుకొని ఉన్నాయి.

# తెలుగు సాహిత్యంలో పద కవితా వికాసం



డా. గుమ్మా సాంబశివరావు
✆ 98493 07333

సంస్కృత సమాసాలతో కూడి, శబ్దాడంబర మయమైనది పండితుల భాష సరళంగా, లలితంగా, తొందరగా అర్థం చేసుకొనేటట్లు ఉండేది పామరభాష. దీన్నే మనం లక్షణానుగుణంగా గ్రాంథిక భాష, గ్రామ్య భాష అని చెప్పుకోవచ్చు. అయితే గ్రాందిక భాషకంటే గ్రామ్యభాష మొదటిదన్న విషయం మనం మరువకూడదు. పామరుల వాడుక భాషే కాలాంతరంలో సంస్కరించబడి, వ్యాకరించబడి లక్షణబద్ధమై గ్రాంథిక భాష అయింది. అంటే పండిత భాష అయింది. ఇలాగే సాహిత్య విషయంలోనూ మనం గమనించవచ్చు. దీన్నే ప్రౌఢ సాహిత్యం, జానపద సాహిత్యం అని పేర్కొనవచ్చు. దీన్నే శిష్ట సాహిత్యం, శిష్టేతర సాహిత్యం అనవచ్చు. రాజాదరణకు పాత్రమైన శిష్ట సాహిత్యం అధికారం చెలాయిస్తూ వచ్చింది. తెలుగు సాహిత్య స్రవంతిలో శిష్టేతర కవితా ప్రవాహం మూడు పాయలుగా ప్రవహిస్తూ వచ్చింది. మొదటిది కేవలం జానపద సాహిత్యం. రెండోది ద్విపద సాహిత్యం. ఇక మూడోది తాళ్ళపాక అన్నమాచార్యునితో ప్రారంభమైన సంకీర్తన సాహిత్యం. దీన్నే పద సాహిత్యం అనవచ్చు. అనాదినుంచి వస్తున్న జానపద గేయరీతుల్ని గమనించి అనేక పదాల్ని శిష్ట కవితలో ఒక భాగంగా వెలయించి, పద్యకవితా పీఠం పక్కనే పద కవితకు సైతం సరిపీఠం సవదరించిన ఘనత అన్నమాచార్యునికే దక్కింది. "సంకీర్తన లక్షణాన్ని" రచించి అన్నమయ్య పదకవితకు విశిష్టతను, గౌరవాన్ని కలిగించాడు.

పద సాహిత్యం దేశికవితా విభూతిలో భాగం. దేశిఅయిన తెలుగు కవిత నాలుగు విధాలని అందులో మధుర కవితారీతిలో చేరినది పదకవిత అని లాక్షణికోక్తి ఉంది. "తెలుగు కవిత ఆశు, మధుర, చిత్ర విస్తరమని నాలుగు రకాలని

చెప్పారు. మధురకవితలో పాటలు, దేశిఛ్ఛందాలు ఉన్నాయి.

తెలుగులో సంకీర్తన సాహిత్యం సింహగిరి నరహరి వచనాలు రచించిన కృష్ణమాచార్యులతో ప్రారంభమైంది. ఈయన తర్వాత పేర్కొనదగిన వారు యాగంటి వారు, వారి పదాలు, వచనాలు పామర ప్రజల్లో బహుళ ప్రచారంలో ఉండేవి. తర్వాతి కాలంలో పోతులూరి వీరబ్రహ్మంగారు వారి శిష్యుడు దూదేకుల సిద్ధయ్య తత్త్వాలు ప్రచారంలోనికి వచ్చిన విషయం అందరికీ తెలిసిందే.

తెలుగు పదసాహిత్యానికి 15వ శతాబ్దం వసంతకాలం. తెలుగు పదకవితకు ఆద్యుడు తాళ్ళపాక అన్నమయ్య అందుకే ఆయన పద కవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ది పొందాడు. ఈయన పుత్ర పౌత్రులు కూడా పద సాహిత్యాన్ని వెలువరించారు. అన్నమయ్య 32 వేల సంకీర్తనలు రచించినట్లు చెప్పబడుతున్నా ఆయన రచనలుగా 13వేలు మాత్రమే లభిస్తున్నాయి. ఇవి శృంగార, ఆధ్యాత్మిక అని రెండు విభాగాలుగా ఉన్నాయి. సంస్కృతంలో 'సంకీర్తన లక్షణము' రచించినట్లు చెప్పబడుతున్నా అది లభించటం లేదు. అయితే దానికి తెలుగు అనువాదంగా అన్నమయ్య మనుమడు చినతిరుమలాచార్యుడు రచించిన సంకీర్తన లక్షణములో 'పద' నిర్వచనం ఉంది.

**భరతాదుల గ్రంథంబుల**
**విరచించిన లక్షణములు వేంకట భూమీ**
**ధరవర కీర్తన లక్ష్యము**
**లురుపద కవితా పితామహుండేర్పఱచెన్" 10**
**పదమగు సుప్తి ఙ్ఞంతము**
**పదమవయవ, మవయవి యును, బదమన్ బరగున్**
**దుది నీ తెలుంగులన్నియు**
**బదకవితామార్గ సార్వభౌముడు దెలిపెన్" 11**
**పదములు శృంగార వధూ**
**మృ దుమధుర మనోజ్ఞ వాక్యమిశ్రములైనన్**
**విదితార్థ గ్రామ్యోక్తులు**
**పదిలముగా బొంక మెఱిగి పలుకగ జెల్లున్ 12**
**అంటూ పదనిర్వచనంగావించాడు.**

**అన్నమయ్య సంకీర్తనల్ని గూర్చి ఆయన మనుమడు చినతిరుమలాచార్యుడు**

**"పావనములు హరిభక్తివి**

**భావనములు సర్వ మంత్ర పరమ రహస్యా**

**ద్భావనములు గాయక, నిక**

రావనములు తాళ్ళపాక అన్నయపదముల్ (3)" అని సంకీర్తన లక్షణములో పేర్కొన్నాడు.

అన్నమయ్య సంకీర్తనములు శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనములని రెండు రకాలు. ఏ సంకీర్తనను గమనించినా అన్నమయ్య అంతరంగం భక్తిభావ ప్రబోధమే. అలమేల్మంగా శ్రీనివాసుల మహిమాభివర్ణనమే అన్నమయ్య.

"పలికింతువు అక్షరముల పరగనవే వ్రాయింతువు

వెలియగ నీవే వెలిగా వేరొకటి నేc జేయc జుమీ' (2-269)



అని భగవంతుడే తనచేత సంకీర్తనలు చెప్పించాడని, ఆ దేవదేవుని విషయాన్ని గాకుండా ఇతర విషయాల్ని ప్రస్తావించనని పలకటమే కాకుండా అన్నమాటను నిలబెట్టుకొన్న అపరభక్త శిఖామణి అన్నమయ్య. ఆయన సంకీర్తనల్లో నాయికా నాయకుల సంయోగ వియోగ శృంగారాలు, రాయబారాలు, సంవాదాత్మకాలు, దశావతారాలు, జానపద గేయ ధోరణులు, దేవుడు జీవుడు, ఆత్మ, పరమాత్మ, మొదలైన అనేక అంశాలు ప్రస్తావితమయ్యాయి.

అన్నమాచార్యుడు, ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యుడు, ఆయన ప్రియపుత్రుడు చిన తిరుమలాచార్యుడి తాళ్ళపాక పద కవిత్రయంగా

ప్రసిద్ధి పొందారు. పెద తిరుమలాచార్యుడు శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలు, వెంకటేశ్వర వచనాలు, శృంగార దండకం, వేంకటేశ్వరోదాహరణం, నీతి సీస శతకం, సుదర్శనరగడ, సంకీర్తన లక్షణ వ్యాఖ్య, శ్రీ వేంకటేశ్వర ప్రభాతస్తవం మొదలైన రచనలు చేశాడు.

చిన తిరుమలాచార్యుడు కూడా శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనములు రచించాడు. చిన తిరుమలయ్య అష్ట భాషా దండకాన్ని కూడా రచించాడని చెప్పటం వల్ల ఆయన బహు భాషా పాండిత్యం స్పష్టమవుతున్నది. చిన తిరుమలయ్య అన్నమయ్య మార్గాన్ని అనుసరించి సంకీర్తన రచనగావిస్తూ ఏ సంకీర్తనలోనూ వెంకటనాథుని ముద్రను వీడలేదు. వివిధ క్షేత్రాల్లో వెలసిన వైష్ణవ మూర్తుల్ని వర్ణించాడు. ఈ విధంగా తాళ్ళపాక పదకవిత్రయం పద సాహిత్యానికి విశిష్ట సేవ కావించింది. తాళ్ళపాకవారి సాహిత్య ప్రచురణ. ప్రచారాలని నిర్వహిస్తున్న తి.తి.దే వారి కృషి ప్రశంసనీయం.

తాళ్ళపాక కవుల తర్వాత పేర్కొనదగ్గ వాగేయకారుడు క్షేత్రయ్య. (1590–1675) ఈయన సుమారు 4,500 పదాలు రచించినట్లు తెలుస్తున్నది. ఈయన సాహిత్యాన్ని పదములు పేరుతో పిలుస్తున్నారు. క్షేత్రయ్య రచించిన పదాలన్నీ మువ్వ గోపాలంకి తాలు. ఇవి శృంగార రసమయాలు. వీటిలో సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యం లభించటమే గాకుండా అభినయం కూడా జోడించబడటం విశేషం. పదాలను అభినయించటం క్షేత్రయ్య రచనల తర్వాత బహుళ ప్రచారానికి నోచుకొన్నది. క్షేత్రయ్యను మొట్టమొదట పరిచయం చేసిన వారు సుబ్బరామ దీక్షితులు. క్షేత్రయ్య పదాల్ని పరిశోధించి వివరించిన వారు విస్సా అప్పారావు. వీరు విపులమైన పీఠికతో 330 క్షేత్రయ్య పదాల్ని విశ్లేషించి గ్రంథాన్ని రచించగా, దీన్ని రాజమండ్రి



ఆంధ్రగానకళా పరిషత్ వారు ప్రకటించారు. (1950) అప్పారావుగారికి వారికంటే ముందు వెలువడ్డ గ్రంథాలు ఉపకరించాయి. 1952లో డా. గిడుగు వేంకట సీతాపతిగారు స్వీయ, పరకీయ, సామాన్య నాయికా విభజన చేసి పదాలకు కొంత ఉపోద్ఘాతం రచించి 380 క్షేత్రయ్య పదాల్ని ప్రకటించటం విశేషం. 1966లో శ్రీ శ్రీనివాస చక్రవర్తి గారు 100 పదాలను వివిధ శీర్షికలతో కూర్చగా జయంతి పబ్లికేషన్స్ వారు ప్రచురించారు. శ్రీమందాళ జగన్నాధ రావుగారు 140 పదాలకు స్వరాలు కూర్చగా 1973లో ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు ప్రచురించారు. ఇంకా చాగంటి శేషయ్య, బాలాంత్రపు రజనీకాంతారావు, ఆరుద్ర, రాళ్ళపల్లి మొదలైన వారు పలువ్యాసాలు క్షేత్రయ్య పదాల్ని విశ్లేషించి రచించారు. ఆచార్య ఎస్. గంగప్ప గారు 1972-73లో క్షేత్రయ్య పదసాహిత్యం' అనే గ్రంథాన్ని రచించి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డును పొందారు. శ్రీ బాలాంత్రపు రజనీకాంతారావు గారు 'క్షేత్రయ్య' అనే ఆంగ్ల గ్రంథాన్ని రచించారు.



భద్రాచల రామదాసుగా (1620-1680) ప్రసిద్ధిపొందిన కంచెర్ల గోపన్న రచించిన కీర్తనలు పల్లె ప్రాంతాల్లోని భజన కూటాల్లో రామమందిరాల్లో వినిపిస్తూ ఉంటాయి. ఈయన దాశరథీ శతకాన్ని కూడా రచించాడు. రామదాసు "ఎంతపని చేసితివి రామా - నిన్నే మనందును సార్వభౌమా - పంతమానా మీద పరమపావననామ....." "కోదండరామ కోదండరామ కోట్యర్కధామ - నీదండ నాకు నీవెందు పోకు, వాదేల నీకు వద్దు పరాకు" పలుకే బంగారమాయెనా కోదండ పాణి, రాముని వారము మాకేమి విచారము తెలియకనే మోసపోయితి దేవదేవుడని, అదిగో భద్రాద్రి

ఇదిగో గౌతమి చూడండీ" మొదలైన కీర్తనల్ని రచిమ్చాడు. కేవల భక్తిమార్గాన్నే రాకుండా, జ్ఞానమార్గాన్ని కూడా తోడు చేసుకొని వైరాగ్యం సిద్ధింపజేసుఒన్న యోగి పుంగవునిగా రామదాసు కనిపిస్తాడు.

పదసాహిత్య రచన గావించిన వారిలో క్షేత్రయ్య, రామదాసుల తర్వాత పేర్కొనదగినవాడు సారంగపాణి (1680-1750) ఈయన చిత్తూరు జిల్లాలోని కార్వేటి నగరం ఆస్థాన వాగ్గేయకారుడి. సారంగపాణి పదాలు మొదటగా కార్వేటి నగరం భారతీ లీలా సదన ముద్రాక్షరశాలలో ప్రకటితమయ్యాయి. తర్వాత 1878లో భువనగిరి రంగయ్యశెట్టి గారి జ్ఞాన సూర్యోదయ ముద్రాక్షరశాలలో ముద్రితమయ్యాయి. 1963లో పురిపండా అప్పలస్వామి గారి సంపాదకత్వంలో రాజమహేంద్రవరం సరస్వతీ పవర్ ప్రెస్‌లో ముద్రించబడ్డాయి. సారంగపాణి జీవితమూ, పదాలకు సంబంధిమ్చిన అనేకాంశాల్ని పరిశీలించి, విశ్లేషించి ఆచార్య ఎస్. గంగప్పగారు 'సారంగపాణి పద సాహిత్యం' అనే గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ముద్రించారు. ఈ గ్రంథాన్ని డా. మంగళగిరి ప్రమీలాదేవి, డా. టి ఎన్. మురళీకృష్ణమ్మ గార్లు హిందీలోనికి అనువదించారు. డా. జి చలపతి 'సారంగపాణి పదములు" పేరుతో ఒక గ్రంథాన్ని వెలువరించారు.

ఆధ్యాత్మికదృష్టితోమునిపల్లెసుబ్రహ్మణ్యకవి "ఆధ్యాత్మరామాయణము" పేరుతో ఎన్నో పదాల్ని రచించాడు. ఈయన రామాయణ కథనంతటినీ ఆరుకొండల్లో 104 కీర్తనల్లో రచించారు. ఈయన కీర్తనలు అనుప్రాసలతో కూడి శృంగార రసాత్మకమైన విశేషణాలతో శివుడి పార్వతిని సంబోధించి రామకథను వినిపించినట్లుండే పల్లవితో ప్రారంభమవుతాయి "వినవేశర్వాణి అలివేణి, నీరజపాణి" వినుముధరావర తనయా ధృత వినయా, సరసగుణాభినయా - కలికీ అలడల ములికీ, చిలుకల కొలికీ వీనుల సుధజిలికీ, కథ వినవే మొదలైమ పల్లమలతో అద్భుతంగా రచించాడు. "ఈయన కొన్ని కీర్తనలు కూడా రాశాడు . క్షేత్రయ్య ప్రభావం ఈయన మీద ఉన్నట్లు స్పష్టమవుతుంది.



తంజావూరు నాయక రాజులు సమకాలీనుల కాలం యక్షగాన, పదకర్తలకు స్వర్ణయుగమని, బాలత్రిపురజనీకాంతారావు గారు తమ వాగ్గేయ కార చరిత్రము గ్రంథంలో పేర్కొన్నారు. యక్షగానకర్తలు పలు పదాల్ని రచించినట్లు సోదాహరణంగా తెలిపారెడు. రంగాజమ్మి, మన్నారు దేవుడు, కంఠీరవరాజు శాహాభూపాలుడు, గిరిరాజకవి, బాలకవి సుబ్బన్న, మొదటిశరభోజీ, తులజాజీ, రెండవ ఏజీజీ, కాశీనాథయ్య, వీరభద్రయ్య, శ్రీనివాసయ్య, ఘనం శీనయ్య, గివిందసామయ్య, కూవన సామయ్య మొదలైన వారిని 'మహారాష్ట్రులు – సమకాలీనులు' అనే అధ్యాయంలో చేర్చి బాలాంత్రపువారు వారి పద సాహిత్య కృషిని వివరించారు. ఇంకా పచ్చిమిరియం ఆదియపయ్య, వీణ పేరు మాళ్ళయ్య, మాతృబూతయ్య, శొంఠి వేంకట సుబ్బయ్య, కుప్పుస్వామయ్య, సదాశివబ్రహ్మేంద్ర మొదలైన వారు కూడా పద సాహిత్యంలో పేర్కొనదగినవారు.

తెలుగులో మహా వాగ్గేయకారత్రయంగా పేర్కొనదగినవారు అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్యలు. ఒక్క దక్షిణ భారత చరిత్రలోనే కాకుండా ప్రపంచ చరిత్రలోనే 1750 నుంచి 1847 వరకూ అత్యంత ప్రధానమైన కాలం. దీన్ని ధాతు కల్పనా యుగమని చెప్పవచ్చు. త్యాగయ్య, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు. వీరిని సంగీత త్రిమూర్తులని, రత్న త్రయమని పిలుస్తారు. ముగ్గురూ తంజావూరు జిలాలోని తిరువూరుకు చెందినవారే సమకాలీనులే. వీరి రచనల్లో రాగ స్వరూపం పరిపూర్ణమై సర్వకళలతోనూ స్పష్టంగా స్ఫూర్తిస్తుంది. వీరు ముగ్గురూ వేదశాస్త్ర పురాణవేత్తలు. జ్యోతిశాస్త్ర మంత్ర శాస్త్రాలలో నిష్ణాతులు.

త్యాగయ్య (1767–1847) శాహభూపాలుని ఆస్థాన వాగ్గేయకారుడైన గిరిరాజ కవికి స్వయాన పాత్రుడు. సీతమ్మ రామబ్రహ్మంగార్ల పుత్రుడు.

త్యాగయ్య రామతారక మంత్రాన్ని ముప్ఫై ఎనిమిది సంవత్సరాలు వచ్చేసరికి 96 కోట్ల పునశ్చరణ చేశాడు. ఈయన వైణికుడుగా, గాయకుడుగా, వాగ్గేయకారునిగా ప్రసిద్ధి పొందాడు. వాల్మీకి రామాయణంలోని 24వేల శ్లోకాలకు, త్యాగయ్య 24 వేల కీర్తనలు రచించాడని చెబుతారు. అయితే ప్రస్తుతం 660 కృతులు మాత్రమే లభిస్తున్నాయి.

త్యాగయ్య 72 మేళకర్త రాగాల్లోను కృతులు రచించాడు. బహుదారి, చెంచు కాంభోజి, దీపకం, దేవామృత వర్షిణి, గంభీరవాణి, జనరంజని, కోకిల ధ్వని, మయూర ధ్వని, నభోమణి, నాదస్వరావళి, సారమతి, సామాభరణం, విజయశ్రీ లాంటి అపూర్వ రాగాలతో కృతులు రచించాడు. త్యాగయ్య ఘనరాగ పంచరత్న కీర్తనలుగా "జగ్గదానందకారక – జయజానకీ ప్రాణ నాయకా, దుడుకుగల నన్నే దొరకొడుకు బ్రోచురా; సాధించేనే ఓ మనసా; కనకర రుచిరా కనక వసననిన్ను; ఎందరో మహానుభావులు అందరికీ వందనములు ప్రసిద్ధి పొందాయి. ఈ కీర్తనల్లో భాష, శైలి జటిలంగా ఉంటాయి. వీటిని గానం చేసేటప్పుడు ఎన్నో సంగతులతో విస్తరించి విజ్ఞులైన విద్వాంసులు పాడటానికి మోగ్యాలై ఉంటాయి.

త్యాగయ్య కీర్తనల్లో ప్రజల విషయంలో లత, డాంబికాచారాలు, ధనవంతుల గర్వ జీవితం, హింసాపరత, జారబోరాది దురాచారాలు, కపటవర్తనలూ ఖండించబడ్డాయి. ప్రతి ఒక్కరూ సంసార జీవనాన్ని సాగిస్తే్న సదాచారాల్ని వీడకుండా, సత్ప్రవర్తనతో, నిష్ఠాగరిష్టులై నియమబద్ధులై నిత్యం భగవద్భక్తిని కలిగి ఉండాలని బోధించాడు. అహంకారాన్ని చంపుకొని, శమదమాది సుగుణాల్ని పెంచుకొని, ప్రాపంచిక విషయాలపై నిర్లిప్తులై ఉండటం మోక్షమార్గమని, డాంబికంగా చేసే జపతపాదుల కంటే అంతశ్శుద్ధి కలిగి నిష్కామమైన భక్తి మార్గమే ముక్తి ప్రదానమైదని ఆయన విశ్వాసం.

త్యాగయ్య కృతుల్లో లోకోక్తులు, పలుకుబళ్ళు కోకొల్లలుగా కనిపిస్తాయి.

**"రూకలు పదివేలున్న చేరెడు నూకలు గతిగాని ఓ మనసా**
**కోకలు వెయ్యున్న కట్టుకొనుట ఒకటేగాని"**
**"ఏరునిండి పారిన పాత్రకు తగు నీరువచ్చుగాని"**
**"ఊరేలిన తా పండుట మూడు మూరతావుగాని"**

**"సోమిదమ్మ సొగసుగాండ్ర కోరితే సోమయాజి స్వర్గార్హుడగునా"
ఇరవొందగ భుజియించు సమయమున ఈగతగులు రీతినున్నది"**

–ఇలా త్యాగయ్య కృతుల్లో తెలుగుదనం ప్రవహిస్తుంది. త్యాగయ్య శిష్యులు ఆరాధనా మహోత్సవాలు ఇప్పటికీ నిర్వహించటం ప్రశంసనీయం.

శ్యామశాసస్త్రుల వారిని గూర్చి దక్షిణ భారతదేశంలో తమిళం మాట్లాడే బ్రాహ్మణులని, వీరి పూర్వులు ఆంధ్ర ప్రదేశ్‌లోని కర్నూలు ప్రాంతం నుంచి తమిళ ప్రాంతానికి వలస వెళ్ళారని తెలుస్తుంది. వీరి తండ్రి విశ్వనాథ శాస్త్రి. ఒక యోగీశ్వరుడు శ్యామా శాస్త్రి గొప్ప వాగ్గేయకారుడవుతాడని చెప్పాడని అది నిజమైందని తెలుస్తుంది. ఈయన తన శిష్యుడైన ఆలనూరు కృష్ణయ్యతో కలసి దేవీనవరత్నమాలికను రచించినట్లు చెబుతున్నారు. శ్యామాశాస్త్రులుకి ఆనందభైరవి రాగం పట్ల అమితమైన ప్రీతి. ఈయన కృతులుగా

**"మరి వేరేగతి యెవరమ్మ - మహిలో బ్రోచుటకు...
సరోజదళ నేత్రి హిమగిరి పుత్రీ నీపదాంబుజములె
సదానమ్మినానమ్మ శుభమిమ్మా శ్రీ మీనాక్షమ్మ"**

మొదలైనవి ఎన్నో ప్రచారంలో ఉన్నాయి.

ముద్దుస్వామి దీక్షితుల్ని తమిళులు ముత్తు స్వామి దీక్షితులంటారు. ఈయన తండ్రి రామస్వామి దీక్షితులు. ముద్దుస్వామి బాల్యంలోనే సర్వశాస్త్ర పారంగతుడయ్యాడు. తిరుత్తణి, కాంచీపురం, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాటకేశ్వర, వల్మీకేశ్వర దేవతామూర్తులమీద కీర్తనలు రచించాడు. తెలుగులో కొద్దిగా, సంస్కృతంలో విశేషంగా రచించిన దీక్షితులవారి కీర్తనలన్నిటిలో వేంకట మఖి ఏర్పరచిన 72 మేళకర్త రాగాలకు సోదాహరణలున్నాయి. త్యాగయ్య కృతుల తర్వాత విశేష ప్రచారాన్ని పొందిన కీర్తనలు ముద్దుస్వామి దీక్షితుల వారివే.

మేలటూరి వేంకట్రామశాస్త్రి త్యాగరాజుకు సమకాలికుడు ఈయన యక్షగానాలతో పాటు చిందు అనే గేయాల్ని ఆద్వైత కీర్తనల్ని రచించాడు. ఇంకా పులియూర్ దొరస్వామయ్య, సంగీత, సాహిత్య నాట్య శాస్త్రాల్లో నిష్ణాతులై పలు సంకీర్తనలు రచించాడు. మానవల్లూరు సభాపతయ్య అనేక సంకీర్తనలు రచించాడూ. "దారి చూచుచున్నది నీదు ప్రియ తరళాక్షి యౌచిన్నది" అన్యాయముగ నేనపదూరు పాలైతి అతివరో యేమందునే" లాంటి ఎన్నో ఉన్నాయి. "పరిమళరంగ" ముద్రతో కీర్తనలు రచించిన వారి

అసలు పేరు తెలియదు. ఇంకా తూమునరసింహదాసు యువరంగని పదాలు, కస్తూరి రంగని పదాలు శోభనగిరి వారి పదాలు మొదలైన రీతిలో ఎంతోమంది పదకర్తలు కృతులు వెలయించారు.

ఆధునిక వాగ్గేయకారులుగా 1850–1956 కాలంలో ఉన్నవారిని గూర్చి చెప్పుకోవచ్చు. అసంఖ్యాకంగా ఉన్న సమకాలీనుల్ని గూర్చి చెప్పటం సాధ్యమయ్యే పనికాదు ఆధునికుల్లో వీణశేషణ్ణ కన్నడ ప్రాంతానికి చెందినవాడైనా వర్ణములు, జావళీలు, తిల్లానాలు తెలుగులో రచించారు. దాసుశ్రీరాములు గారు అనేక కృతులు సర్వజతులు, పదాలు, జావళీలు రచించటమే గాక పద్యకృతులు, నాటాకాలు రచించారు. తుమురాడ సంగమేశ్వర శాస్త్రిగారు బొబ్బిలి ప్రాంతంవారు ముత్తయ్య భాగవతార్ ఊర్మిళ రాగం, వలజిరాగం, బుధమనోహరి, కర్ణరంజని, పశుపతి ప్రియ మొదలైన రాగాల్ని కనుగొన్నారు. మైసూరు వాసుదేవాచార్యగారు తెలుగులో సంస్కృతంలోనూ మూడువందల కీర్తనలను, వర్ణాలను, రాగమాలికలను స్వరజతులను, తిల్లానాలను రచించారు. ఈతన కృతులు 'వాసుదేవ కీర్తన మంజరి' పేరుతో వెలువడ్డాయి. ప్రయాగ రంగశర్మగారు ఎక్కువగా భజన సంప్రదాయ కీర్తనలు, మంగళ హారతులు, తలుపుదగ్గర పాటలు, పెళ్ళిళ్ళ వేడుక పాటలు రచించారు. కొచ్చెర్ల కోట రామరాజు గారు భజన సంప్రదాయాంలో పలుకీర్తనలు రాశారు. పిరాట్ల శంకరయ్య శాస్త్రిగారు వర్ణాలు, కృతులూ రచించారు. శంకర ముద్ర వీటన్నిటిలో ఉంటుంది. ఆధునిక వాగ్గేయకారుల్లో ఆదిభట్ల నారాయణదాసు, హరినాగ భూషణం గార్లు ఎంతో ప్రసిద్ధులు. వాగ్గేయకార రత్నబిరుదాంచితులు. సంస్కృతాంధ్రల్లో యాభైకి పైగా కీర్తనలు రచించారు. ఇంకా ఓగిరాల వీర రాఘవశాస్త్రి, తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకటనారాయణాచార్యులు, శొంఠి సీతారామయ్య రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగార్లు ప్రసిద్ధులు.

ఆధునిక వాగ్గేయకారుల్లో శిఖరాయమాన మైన వారు మంగళంపల్లి బాలమురళీకృష్ణ. ఎనిమిదేళ్ల ప్రాయంలోనే సంగీత ప్రపంచంలో మేటియై అపరత్యాగరాజుగా వేలుగొందిన శారదామూర్తి మంగళంపల్లి 72 మేళకర్త రాగాలలోనూ రాగానికి ఒక్కొక్క కృతిచొప్పున 'జనకరాజు కృతిమంజరి' అనే గ్రంథాన్ని రచించి ముద్రించారు. వీరి ప్రతికృతి త్యాగయ్య దర్శనమిస్తారు. ఇంకా ఎంతోమంది సంకీర్తన కర్తలు ఆంధ్రదేశంలో విరాజిల్లారు.

ఆంధ్రదేశం వాగ్గేయకారులకు పుట్టినిల్లు అని చెప్పటం సహజోక్తి.

# అన్నమయ్య అంతరంగ తరంగాలు



డా. పి. సుమతీ నరేంద్ర
✆ 93910 39119

తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనాచార్యుడు, పరమ భాగవతోత్తముడు. శ్రీ వేంకటేశ్వరుని పదకుసుమాలతో అర్చించిన పదకవితా పితామహుడు. తదనంతరం వచ్చిన వాగ్గేయకారులందరికీ మార్గదర్శకుడు. అన్నమయ్య పదాలు సంగీత సాహిత్యాలను కలిపే వారధులు. తన అంతరంగంలో వెల్లువెత్తిన భక్తి భావ తరంగాలను పద సాహిత్య రూపంలో పదిలంగా మనకందించిన మహాకవి. జన బాహుళ్యంలోకి చొచ్చుకొనిపోయిన అన్నమయ్య పదాలు కొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. తక్కినవాటినే మనకందించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ప్రాతఃస్మరణీయులు.



అన్నమయ్య భావ తరంగాలు నిసర్గ సుందరాలు పాండిత్య ప్రకర్షకోసం ఆయన పాకులాడలేదు. అహరహం ఆ అలమేల్మంగాపతిని స్మరిస్తూ, భావిస్తూ, దర్శిస్తూ, లాలిస్తూ, అతని నామాలను, లీలలను వర్ణిస్తూ, కీర్తిస్తూ అతడి తోడిదే లోకంగా జీవించాడు. ఆడినా, పాడినా, పొగడినా, తెగడినా, పంతగించినా, పరిహాసాలాడినా ఆ శ్రీనివాసుడితోనే. ఆ పారవశ్యం సామాన్యులకు

అంతుచిక్కనిది. ఆ లోతులలో దిగి మునకలువేసి అనర్ఘరత్నాలను అందిపుచ్చుకోవడమే మనం చేయవలసిన పని. కావలసింది పూనిక, సహృదయ భూమిక మాత్రమే.

భక్తి పారవశ్యంలో ఓలలాడుతూ అలవోకగా అన్నమయ్య చెప్పిన పదాలలో భావ కమలాలు చేతికి అందినట్లే అంది అంతలోనే దూరమవుతాయి. ఆ భావ తీవ్రత భాషకు అందనంత గాఢమైంది. ఆ భావ నైశిత్యానికి పరమోదాహరణ ఈ పదం.

"ఏమొకొ చిగురుటధరమున
యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన
పత్రిక కాదు గదా"

అధరాన్ని పత్రికతో ఉపమించడం అపూర్వం. ఎడనెడ నిండిన కస్తూరి పత్రిక మీద వ్రాసిన వ్రాత. భావించిన కొలది పరమ రమణీయమైన అభివ్యక్తి.

"కలికి చకోరాక్షికి కడకన్నులు కెంపై తోచినవి." ఈ ఎఱ్ఱదనం కోపంతో, అలుకతో వచ్చినది కాదు. ప్రాణేశ్వరుపై నిలువున నాటుకొన్న ఆ కొనచూపు పెరుకగ అంటిన రక్త వర్ణం అని భావించాడు అన్నమయ్య చూపులను శరాలతో పోల్చడం వరకే ఆగిపోకుండా ఆ చూపుల శరాలు నాటుకోవడాన్ని వెనక్కులాగినప్పుడు కొనలకు మాత్రం అరుణిమ అంటుకోవడాన్ని అద్భుతమైన భావనా బలం కలిగిన అన్నమయ్యకు మాత్రమే

2

సాధ్యం! నఖ శశిరేఖలను వేసవికాలం వెన్నెల కాదుగదా అన్నాడు అది ఆహ్లాదకరం అనుభవైక వేద్యం, మరీ మరీ అభిలషణీయం.

"చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెర మోవికి చాంగుభళా."

చిగురుటధరం అన్న ముందటి భావనకు ఇది కొసమెరుపు. అధరామృతం అంటారు పండితులు. అమృతం రుచి ఎవరికి తెలుసు. పంచదార రుచి

అందరికీ అనుభవంలో ఉంటుంది. అందుకే మధురమైనది అనడానికి చక్కెరమోవి అన్నాడు అన్నమయ్య. రూపాన్ని బట్టి కాకుండా గుణాన్ని బట్టి అభేదాన్ని ఆరోపించాడు. అపురూప ప్రయోగం 'చక్కెరమోవి'.అలమేల్మంగను చందనగంధి అన్నప్పుడు చందన ప్రియుడైన స్వామి గుర్తురాక మానడు. ఆ చందనం ఆమెమేనిదా, ఆ స్వామి అలదుకొన్నదా – ఆలోచించేకొలదీ ఆనందకారకమౌతుంది.

**"ఉన్నతి పతిపై ఒరిగి నిలుచు తన**
**సన్నపు నడిమికి చాంగుభళా"**

అస్తినాస్తి విచికిత్సా హేతుశాతోదరీ అంటాడు మహా కవిసార్వభౌముడు శ్రీనాధుడు. కానీ అది పండితైక వేద్యం. 'సన్నపు నడిమి' సామాన్యులకు అనుభవంలో ఉండే స్వభావోక్తి. అందం, లాలిత్యం, సహజత్వం ఝుటిత్యర్థ స్ఫూర్తిని కలిగిస్తాయి ఈ ఉక్తిలో. అందని మానిపండు కాదు అన్నమయ్య కవిత్వం. వేసవికాలంలో వీచే పిల్ల తెమ్మెర – అహ్లాదభరితం!

శ్రీకృష్ణుడిని ఎంతమంది సంస్కృతాంధ్ర కవులు ఎన్ని విధాలుగా వర్ణించారో చెప్పనలవి కాదు. అన్నమయ్య అమోహనాంగుని విలువైన నవరత్నాలతో పోల్చి చెప్పాడు. శ్రీ కృష్ణుని వివిధ దశలను చేష్టలను అసామాన్యంగా ఒకే ఒక్క పదంలో వర్ణించాడు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన ఇది. చిన్ని శిశువు, కొంటె బాలుడు, దుష్ట సంహారి, రసరమ్య మనోహారి, లీలామానుష విగ్రహుడు కనులముందు సాక్షాత్కరింప జేశాడు. నవరత్నాలను, నవ రసాలను మేళవింప జేసిన ఈ పదం అనితర సాధ్యం, ఉపాదేయం!

**"ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు**
**తిద్దరాని మహిమల దేవకీ సుతుడు"**

ఈ పదంలో శ్రీకృష్ణుడు గొల్లపిల్లవాడిగాను, పరమాత్మగాను దర్శనమిస్తాడు. గొలతల అరచేతి మాణికము నమ్మిన వారికి కొంగుబంగారం అన్నంతలోనే పంతమాడే కంసునీ పాలి వజ్రము అంటాడు. చెంతలో మాలోనున్న చిన్న కృష్ణుడు భక్త సులభుడే! రతికేళి రుక్మిణికి రంగుమోవి పగడము – శృంగారం, కంసుని పాలి వజ్రము – వీరం, మితి గోవర్ధనపు గోమేధికము – అద్భుతం, సతమై శంఖ చక్రాల సందుల

3

వైఢూర్యం – శాంతం, కాళింగుని తలలపై కప్పిన పుష్యరాగము – రౌద్రము – రసభావ తరంగాలు ఒకదాని వెంట ఒకటి ముప్పిరి గొని వస్తాయి. రంగుల హరివిల్లు మనోభిత్తికమీద వెల్లి విరుస్తుంది. ఏలేటి శ్రీ వెంకటాద్రి ఇంద్రనీలము – నీల మేఘశ్యాముడు కమనీయ దర్శనము కలుగుతుంది. శ్రీకృష్ణ తత్వాన్ని అంతా ఈ పదంలో ప్రోది చేశాడు అన్నమయ్య. బాలునివలె తిరిగే పద్మనాభుడు – గతియై మమ్ముగాచె కమలాక్షుడు అని నిర్ధారిస్తాడు. రసభావ తరంగాలలో ఓలలాడిస్తాడు. (కులదైవమా, కాలమేఘమా అని ఆర్తితో పిలుస్తాడు. భక్తాగ్రేసరుడైన అన్నమయ్య. సార్థక పదప్రయోగం! నల్లనయ్యను కాలమేఘం అనడం స్వభావోక్తి! కాలాతీతుడైన పరబ్రహ్మను కాలమేఘం అనడం – ఔచితీమండితం. 'భావింప కైవసమైన పాలిజాతమా – భక్తసులభుడే భగవంతుడు. చింతామణీ, కామధేనువా, సిద్ధమంత్రమా, దివ్యౌషధమా, వినూత్నమైన సంబోధనలివి చివరికి ప్రాణబంధుడా – భావతీవ్రత ద్యోతకమయ్యే పిలుపు. ఆర్తికి పరాకాష్ట. ఇతః పూర్వంకానీ, తదనంతరం కానీ కనిపించని భక్తి భావ తరంగాల ప్రకంపనలివి అన్నీకూడా.

శ్రీ మహావిష్ణువును 'ఎద్దు' అని సంభావించిన కవులు అరుదు. అన్నమయ్య రైతులకు ప్రాణప్రదమైన ఎద్దుతో స్వామిని ఉపమించాడు. "పొలమెల్ల దిరిగిన బోడెద్దు" అన్నప్పుడు పొలం అంటే 'విశ్వం' అని, తిరిగిన అంటే వ్యాపించిన అని, బోడెద్దు అంటే బంధనాలకు కట్టుబడని భగవంతుడని అర్థం.

**"పురములు సాధించ బూనినపుడు**
**భూమి భరమెత్తి నిలిచిన బండెద్దు" అంటాడు.**
**"పరివోని మందల పసుల బోదోలి**

శ్రీవరుడై రోగట్టుపడినెద్దు" అన్నప్పుడు యశోదమ్మ రోటికి కట్టిన కృష్ణుడు ప్రత్యక్షమౌతాడు.

**"గోవైన భూదేవి నూరిమి జేకొని**
**లావైన వృషభాచలపు టెద్దు**
**మోపగ వేదాలు మొల్లమై సిరి తోడె**

శ్రీ వేంకటాద్రి మించిన మాయలెద్దు" వరహావతారంలో భూమిని ఎత్తి పట్టాడు శ్రీ మహావిష్ణువు గోశతాబ్దానికి గోవు, భూమి అనే రెండు అర్థాలు ఉండడం ఇక్కడ విశేషం. సిరితో కూడిన వేదవేద్యుడు శ్రీ వేంకటాద్రిపై వెలసిన విభుడు, అనంతుడు, అప్రమేయుడు కనుక "మాయలెద్దు" అని మురిపెంగా వర్ణించాడు అన్నమయ్య.

'శేషశాయికి మొక్కుశిరము" అన్నాడు పోతన. "పదివేల శేషుల పడగల మయము" శ్రీహరి వాసము అని వర్ణించాడు అన్నమయ్య. "భావింప సకల సంపద రూపమది" అన్నాడు. ఎంతో లోతైన భావాన్ని అలవోకగా అలతి అలతి పదాలతో వర్ణించాడు పదకవితాపితామహుడు. "బంగారు శిఖరాల

4

బహుబ్రహ్మమయము. సౌందర్యాత్మక వర్ణన ఇది. భ్రాంతిమదాలంకారం" బ్రహ్మమొక్కటే, పరబ్రహ్మమొక్కటే" అని తెలిపిన అన్నమయ్య ఆ శిఖరాలను చూచిన తన్మయత్వంతో బహు బ్రహ్మమయమని పాడాడు. 'కైవల్యపదము వేంకట నగమదివో" అని ముక్తాయింపు.

"కొండల తిమ్మని కొయ్యమాటలతో

ఒయ్యన తిట్టకు రోరమ్మా" అని గొల్లెతలను మందలిస్తూ తాను యశోదమ్మయై స్వామిని కాపాడుకొంటున్నట్లు భావిస్తాడు భావకుడైన కవి. 'కొండల తిమ్మడు అని కోనేటి రాయుడిని పిలవడం అన్నమయ్యకే చెల్లింది. ఆ స్వామిని ఎంత ఆరాధించాడో అంతకంటే ఎక్కువ అలమేల్మంగను స్మరించాడు, వర్ణించాడు అన్నమయ్య. ఆమె సొగసులను, లీలలను, వలపు తలపులను పరిపరివిధాల పరవశుడై ప్రస్తుతించాడు.

**'తెలి కన్నుల నీ తేటలే కదవే**
**వెలయగ విభునికి వెన్నెలలు."**
**ఆయమ చూపులే ఆయనకు వెన్నెలలట.**

ఆమె కౌగిలి శ్రీ వేంకటేశ్వరునకు 'సిరినగరు' అట. శ్రీనివాసుని వక్షస్థలంలో శ్రీ మహాలక్ష్మి కొలువై ఉంటుంది. అందుకే ఆనామం సార్థకమైంది.

**"ముయ్యక మూసిన మొలకనవ్వుగదే**
**నెయ్యపు కప్రపు నెరిబాగాలు."**

"మొలకనవ్వు" పదప్రయోగం మందహాసాన్ని మించిపోయింది. మనోహరం ఈ వినూత్న వర్ణన. వివిధములైన నవ్వులను వర్ణించిన తిక్కన ఈ నవ్వును మెచ్చి తీరుతాడు. "కొలనిలోన మునుగోపికలు మొలక నవ్వులతో మొక్కిరి నీకు" అని మరొక సందర్భంలో చిత్రీకరించాడు.

**"మెరయు శ్రీ వెంకటేశు మేని సింగారముగాను**
**తరచయిన సొమ్ములు ధరియించగా**
**మెరుగుబోణి అలమేలు మంగయుతాను**
**మెరపు మేఘము కూడి మెరసినట్లుండె"**

మేఘానికి మెరపు తొడగినట్లుందట వారి సౌందర్యం! అలమేలుమంగా శ్రీనివాసుల కళ్యాణం లోకానికే ఆనందకారకం".

**నునుసిగ్గుల పెండ్లి కూతురు" వర్ణన మనోహరం.**
**"పిడికిటి తలంబ్రాల పెండ్లి కూతురు కొంత**

5

పెడమరలి నవ్వీని పెండ్లి కూతురు.....

పాట మొత్తం పూర్తయ్యేసరికి తెలుగువారింటి కొత్త పెళ్ళికూతురిలా సాక్షాత్కరిస్తుంది అలమేలుమంగ. "పెద్ద తురుమువెట్టి పెండ్లికూతురు" అన్నప్పుడు గోదావేవి గుర్తురాక మానదు." పేరంటాండ్రనడిమి పెండ్లి కూతురు విభుపేరు కుచ్చ సిగ్గుపడీ పెండ్లికూతురు" జగన్మాత అయినా పెండ్లి కూతురుగా మారినప్పుడు విభుని పేరు ఉచ్చరించడానికి సిగ్గుపడుతుంది మరి! పేరుగల జవరాలు కనుక విభుని కంటె బిరుదు పెండెముపెట్టినదట. శ్రీలక్ష్మి ఆయన ఇల్లాలు "సింగిరాలకేమి కొదువ"!

**"గొల్లెతలు చల్లలు గొనకొని చిలుకగ**
**వెల్లవిరియాయె విష్ణుకథ" అంటాడు అన్నమయ్య.**

సాధారణమైన విషయం చల్ల చిలికితే వెన్న రావడం. అయితే అన్నమయకు

వెల్లడి అయింది మాత్రం విష్ణుకథ. బ్రహ్మాది దేవతలకు, నారదాది మహర్షులకు, వేదవిద్యాపారంగతులకి మాత్రమే విష్ణుకథ విధితం. సామాన్యులైన గోపకాంతలకి చల్ల చిలుకుతున్నా కృష్ణుని మీదనే మనసు లగ్నమైనందున విష్ణుతత్వం వెల్లడి అయింది. అన్నమయ్య యజ్ఞయాగాది కర్మ క్రతువులు చేయకపోయినా వెల్లివిరిసినది విష్ణుకథ. భక్త సులభుడు భగవంతుడు అన్నది సారాంశం! అతి సుందరంగా భక్తి పారమ్యాన్ని బోధించడం జరిగింది. "విన్నపాలు వినవలె వింతవింతలు, పన్నగపు దోమతెర పైకెత్తవలె" అని స్వామిని మేలుకొల్పుతున్నాడు భక్తుడు. స్వామికి మేలుకొలుపా, ఆయనకు తెలియని వింతలా అని తర్కానికి దిగితే సౌందర్యం ఎగిరిపోతుంది. కవిత్వం హృదయ సంబంధి వ్యాపారం. భావుకత ప్రధానమైన రసానందకారకం. వలపు తీవ్రతను వర్ణించని కవిలేడు కాని అన్నమయ్య వర్ణించిన తీరు విచిత్రం. ముగ్ధమనోహరం.

**"తామసించి యుండలేక తల్లడించగాను**
**చీమలు మై ప్రాకినట్లు చిమ్మరేగె వలపు."**

వలపు తీవ్రమైన గోప వనిత మనఃస్థితి ఇట్లున్నదట 'చిమ్మరేగె వలపు' విశేష ప్రయోగం

**"నోరునిండా జొల్లుగార నూగి ధూళిమేనితో**
**పారేటి బిడ్డని వద్ద పాడేరు**
**ముద్దులు మోమున గారమాల మూలల దాగే**
**బుద్ధుల బాలుని వద్ద బాడేరు"**

పాడేవారు బ్రహ్మాదిదేవతలు, పారాడే శిశువు శ్రీకృష్ణుడు. పసిబాలుడు కూడా కాదు చిన్ని శిశువు. స్వాభావికమైన వర్ణన. జొల్లుగార, ధూళిమేను, మూలలదాగడం బాల్య చేష్టలు. భావాంబర వీధి విశ్రుత విహారి

6

అయినఅన్నమయ్యకేఈవర్ణనసాధ్యం!అంతరంగతరంగాలలోఓలలాడించాడు. మనుషుల మౌఢ్యాన్ని అన్నమయ్య వర్ణించిన తీరు అపూర్వం.

**"కడలుడిపి నీరాడగా తలచువారలకు**
**కడలేని మనసుకు కడమ ఎక్కడిది?**
**ముంద ఱెరిగిన వెనుక మొదలు మరిచెదనన్న**
**ముంద ఱేమెఱుగు తామొదలేల మఱచు**
**దాహో మణిగిన వెనుక తత్వమెఱిగెదనన్న**
**దాహామే మణగు తా తత్వమే మెఱుగు"**

మాయలోపడి పరతత్వాన్ని గ్రహించలేని వారలను ఉద్దేశించి అన్నమయ్య చెందిన నిర్వేదం ఇది. ఇహలోక వాంఛలలో కూరుకుపోయి, బంధాలను బాధ్యతలనుకుంటూ కాలం గడుపుతున్న సామాన్యులు ముందు ముందు పరాన్ని గురించి తెలుసుకోవచ్చులే అని కాలం గడిపేస్తారు. చివరకు మొదటి దశను మరచిపోలేరు చివరి దశను చేరుకోనులేరు. ఇది యదార్థం!

అన్నమయ్య సామాజిక చైతన్యం మెండుగా కలిగిన గొప్ప భావుకుడు. బంటు అయినా బ్రాహ్మణుడే అయినా మెట్టుభూమి ఒకటే అని చాటినవాడు. రాజు, పేద అనే భేదం బతికి ఉన్నన్నినాళ్ళే భావించుకొంటాం. కాని కాలం కడతేరిన నాడు అందరూ ఒకటే. అంతా ఒకటే అని నమ్మిన అన్నమయ్య దార్శనికుడు, తాత్విక చింతన కల ఋషితుల్యుడు. ఆ వేంకటేశ్వర మంత్రాన్ని అంది పుచ్చుకొని ఆ పరమాత్మలోనే లీనమైనాడు. తాను మాత్రమే తరించాలనుకోలేదు. తనలో తాను భగవద్ధ్యానంలో లీనమై ఉండిపోలేదు. సమాజంలో ఉంటూ సామాన్యులలో చైతన్యాన్ని ప్రోదిచేస్తూ భక్తి భావ తరంగాలలో అందరినీ ఓలలాడిస్తూ సార్థకమైన జీవితాన్ని గడిపాడు. పామరులకు సైతం అర్థమయ్యే ప్రజల భాషలో సరళమైన, సుందరమైన, భావబంధురమైన, విశిష్ట రీతిలో పదాలను అలవోకగా ఆలపిస్తూ తరించాడు, మనలను తరింప జూచాడు. ఆ పదకవితా పితామహుడు వాగ్గేయకారులలో అగ్రేసరుడు!

# శ్రీ తాళ్ళపాక చిన తిరుమలయ్య - పద ప్రయోగ విశేషాలు



**ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు**
78939 82500

ప్రవేశిక :- లభ్యమవుతున్న తెలుగు సాహిత్యంలో నిఘంటువుల కెక్కని పదాలు అనేకాలు కనిపిస్తున్నాయి. అందులో అధికభాగం తాళ్ళపాక కవుల ప్రయోగాలు ఉన్నాయి. ప్రాచీన కావ్యాల్ని ఆధారం చేసుకొని వచ్చిన శబ్దరత్నాకరము, సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదలైన నిఘంటువుల నిర్మాణం జరిగే నాటికి తాళ్ళపాక కవుల సాహిత్యం వెలుగు చూడలేదు. తెలుగు సాహిత్యంలో అనేక కొత్త పదాలు పుట్టుకొచ్చాయి, పుట్టుకొస్తున్నాయి. అట్లే ఎన్నో పదాలు మరుగున పడిపోయాయి, పోతున్నాయి. కొన్ని పదాలు అర్థ విస్తృతిని చెందినాయి, మరికొన్ని పదాలు అర్థ సంకోచాన్ని చెందాయి. మర్కొన్ని పదాలు సంస్కృతం నుండి తెలుగులోనికి వచ్చి సంస్కృతంలో ఉన్న అర్థానికి భిన్నార్థాన్ని సూచిస్తున్నాయి. ఉదాహరణకు కష్టమైన పనిని కష్టపడి సాధించడానికి సంస్కృతంలో "కరతలామలకం' శబ్దం వాడబడుతుంది. ఈ విధంగా తెలుగులో శబ్దాలు వింతగా కనిపిస్తుంటాయి. అందులోను తాళ్ళపాక కవులు వారి సాహిత్యం నిండా వారి కాలం నాటి రాయలసీమ ప్రాంతం తెలుగును, అందులోను ప్రత్యేకించి రాజంపేట ప్రాంతం మాండలిక పదాలను విరివిగా వాడినారు. అందులో కొన్ని పదాలు ఈనాడు ఆ ప్రాంతంలో కూడా వాడుకలో లేవు. ఆచార్య రవ్వా శ్రీహరి గారు "అన్నమయ్య పదకోశం" అని ఒక ప్రత్యేక నిఘంటువును తయారుచేశారు. వారు అందులో కొన్ని పదాలకు ఆయా సందర్భానికి తగినట్లుగా అర్థాన్ని భావించారు. అందులో కొన్ని పదాలు వివిధ సందర్భాలలో ప్రయోగించిన సందర్భాలను బట్టి ఒకే పదానికి అనేకార్థాలు

ఊహించారు. మరికొన్నింటికి అర్థం స్ఫురించుట లేదని చెప్పక తప్పలేదు.

చిన తిరుమలయ్య :- ఒకనాటి కడప జిలా ఈనాటి రాయచోటి జిల్లాలోని రాజంపేటకు చేరువలో తాళ్ళపాక గ్రామం ఉంది. "తాళ్ళపాక" శబ్దానికి తాడిచెట్లను దూలాలుగా, నిలువులుగా, అడ్డలుగా ఉంచి తాటి ఆకులు కప్పి తయారు చేసిన పాకలు గల ఊరని అర్థం. అన్నమయ్య తరువాత ఆ కుటుంబానికి తాళ్ళపాక అని గ్రామం పేరే ఇంటి పేరుగా మారింది. అన్నమయ్య కుటుంబం నందవరీక బ్రాహ్మణులు. అన్నమయ్య తండ్రి నారాయణసూరి. సూరి ఋగ్వేది ఆశ్వలాయన సూత్ర్యుడు భారద్వాజోగోత్రుడు. సూరి భార్య లక్కమంబ వీరికి శ్రీ వేంకటేశ్వర స్వామి వరప్రసాదంతో 14-4-1408 లో న అన్నమయ్య జన్మించాడు. అన్నమయ్య తన పదనాఱవ యేట తిరుమలమ్మను, అక్కలమ్మను వివాహం చేసుకున్నాడు. తిరుమలమ్మనే తిమ్మక అని కూడా అంటారు. ఈ తిమ్మక్క కుమారుడే "కవికర్ణరసాయనము" కావ్యకర్త నరసింహకవి. అక్కలమ్మ కుమారుడు పెద తిరుమలాచార్యుడు పెద తిరుమలయ్య భార్య తిరుమలాంబ. ఈ దంపతులకు పుట్టిన వాడే చిన తిరుమలయ్య లేదా చిన తిరుమలాచార్యుడు. ఈతని రచనలుగా మనకిపుడు ఆధ్యాత్మిక సంకీర్తనలు అరవై. శృంగార సంకీర్తనలు నూట పందొమ్మిది, సంకీర్తన లక్షణము, అష్టభాషా దండకము లభిస్తున్నాయి. ఈతడు తన తాత అన్నమయ్యను బాలభక్తి శ్రద్ధలతో కొనియాడినాడు.

**"అప్పని వరప్రాసాది అన్నమయ్య**
**అప్పనము నూకె కలడన్నిమయ్యా (ఆధ్యాత్మిక - కీర్తన - 23)**

**అని గొప్పగా చాటినాడు. తనకు తండ్రి గురువు అన్నీ అన్నమయ్యయే యని**

**తాళ్ళపాక అన్నమాచార్య దైవమను నీవు మాకు**
**వేళమె శ్రీహరి గనేవెర వానలిచ్చిర్తివి" (ఆధ్యాత్మిక - కీర్తన -39)**

వివరించాడు. అటువంటి చిన తిరుమలాచార్యుడు తన ఆధ్యాత్మిక సంకీర్తనలలో ప్రయోగించిన కొన్ని శబ్దాలకు వివరణ ఈ వ్యాస ముఖ్య ఉద్దేశ్యం.

**"ఏలికమైన వచినేల మరదగవలె**
**పాలుమాలి మరియాల భంగపడవలెను**

యిరుకు మంచిసంధి నేటికి జారవలె

తిరగలేక యేల – తిమక వలె (ఆధ్యాత్మిక – కీర్తన – 49)

ప్రభువైన శ్రీహరిని ఎందుకు దుర్చిపోవాలి? సోమరితనంతో ఎందుకు అవమానాన్ని పొందాలి ఇరుకుమాను సందులో ఎందుకు దూరాలి అటుఇటు పోలేక ఎందుకు కష్టపడాలి.

ఇరుకుమాను సంధి :– సన్నిని గొంది దానియని అర్థం. ఇఱుకు అంటే 'కొంచెపుతావున నడుచు" అని శబ్దరత్నాకరము చెప్పింది. పల్లెలలో ఊరి ప్రక్కనే పొలాలుంటాయి. రాయలసీయ ప్రాంతంలో సహజంగా పల్లెల చుట్టూ మెట్టపొలాలే ఉంటాయి. ఇవి వర్షాధార పొలాలు, నేటి కాలంలో పెట్ట పొలాలు చాలావరకు మామిడి మొదలైన ఫలాల తోటలుగా మారినాయి. పూర్వం ఈ మెట్ట పొలాలే రైతులు జీవించడనికి ఎక్కువగా ఉపయోగపడేవి. వర్షాధారంగా ఈపొలాల్లో వేరుశెనగ, సజ్జ, జొన్న, రాగి, అరిక, కంది, ఉలవ, అనప, ఆముదము, అలసంద, మిరప, ఉద్దులు మొదలైన పంటలు పండించేవారు. వ్యవసాయపు పనులు ప్రారంభమైనపుడు పొలాల వైపు పోయే దారిలో మనిషి మాత్రమే పట్టేటంత దారి పెట్టి, ఇటు అటు రెండు బండలు కాని రెండు రాతి కూసాలు గాని లేదా రెండూ కొయ్య కూసాలు గాని పాతేవారు. అందువలన పశువులు పొలాలలోనికి పోయి పంట నాశనం చేసే అవకాశం ఉండదు. ఈ దారి కాకుండా పల్లెలోనికి బండ్లు రావడానికి ఒకదారి ఉంటుంది. మెట్ట పొలాల్లో పైరి ఉన్నంత కాలం పశువుల రాకపోకలకు ఆ దారిని వాడేవారు. మెట్టపొలాల్లో పంటలు చేతికి వచ్చిన తరువాత (చేనులు, పరిగలు పోయినాయి అని అంటారు) ఈ దారిని మళ్ళీ ప్రారంభిస్తారు (పాతిని రాతి కూపాలో కొయ్య కూసాలో తొలగిస్తారు) ఆ సన్నని దారిని ఇరుకు మాను దారి అని అనేవారు. చిన తిరుమలయ్య ఇక్కడ ఇరుకుమాని దారి శబ్దాన్ని అని సన్ని దారి అదే అర్థంలో ప్రయోగించినాడు.

తిమక :– ఇరుకు మాను తయారుచేసే విషయంలో ఆ వూరి పరిస్థితిని బట్టి ఆ సందు వెడల్పు ఉంచుతారు. ఆ ఊరిలో ఆవులు, ఎద్దులు, ఎనుములు (బట్టెలు) దున్నపోతుల వంటి పశువులు మాత్రమే ఉంటే కొంచెం పెద్దసందు, అంటే మనుషులు బాగాపోవడానికి అనుకూలంగా, పశువులు పోవడానికి

వీలు లేకుండా తయారు చేస్తారు. ఒకవేళ ఆ ఊరిలో పశువులతో పాటు గొఱ్ఱెలు, పొట్టేండ్ళు, మేకలు, మేకపోతులు మొదలైనవి కూడా ఉంటే ఆ సందు చాలా సన్నగా ఉంచుతారు. అపుడు లావుపాటి మనుషులు కూడా సరిగ్గా పోలేరు. వారు అడ్డంగా తిరిగి పోవలసి ఉంటుంది. అక్కడ ఇరుకు మానుగా నాటే బండలు కాని కూసాలు గాని 4 1/2 లేక 5 అడుగులు ఎత్తు మాత్రం ఉంటాయి. ఆ సన్న సందులో లావుపాటి మనిషి పోయేటప్పుడు ఆ బండలకు లేదా కూసాలకు పొట్ట అదుముకొంటుంది. అపుడు ఆ మనిషి ముక్కి ముక్కి మెల్లగా పోవలసి ఉంటుంది. అలా ముక్కి ముక్కి పోయే సందర్భంలో మనిషి అటు ఇటు ఊగుతాడు. ముక్కుతూ ఊగేదాన్ని "తిమక" అని అంటారు.

"ఏమొకొ నేమేమొకో
యీ మొహము మానమేమొకో (పల్లవి)
కావరించినట్టి కాపరములలో
నీవలావలయ్యే మేమొకో
దావతి సుఖముల దారి దెలిసియు
నేవగించలే మేమొకో (ఏమొకొ)
కాలపు జిక్కుల కర్మపు తొడసుల
యీలకరచే మేమొకో
తాలిమి చెరిచెటి ధనము మీది వాంఛ
యేల యింకా మానమేమొకో (ఏమొకొ)
వోడుపోయినట్టి వుంగిటి బతుకుల
యీడగిలబడే మేమొకో
వేడుకతో శ్రీవెంకటనాధుడు
యిందనే దుముగాచెనేమొకో (ఏమొకొ)
(ఆధ్యాత్మిక – కీర్తన –5)

భావం :– ఎందుకో మానవుడు అరిష్వర్గాలలో ఒకటైన మొహాన్ని వదలిపెట్టలేకపోతున్నాడు. అధికమైన కోరికలతో సంసారంలో చిక్కుకొని ఇటూ అటూ అవుతున్నాడు తప్పా అందులోంచి బయటపడలేకపోతున్నాడు. పీడించే సుఖాల నుండి బయటపడే మార్గం తెలిసి కూడా అ సుఖాలను

త్యజించలేకపోతున్నాడు. కర్మ సంబంధమైన కాలపు చిక్కులలో తగులుకొని ఓటమిని నశింపజేసే ధన సంపాదన మీద కోరికలు ఎందుకో మానుకోలేకపోతున్నాడు. చితికిపోయి రోగగ్రస్తమైన మొండి బ్రతుకులే బ్రతుకుతున్నాడు. అన్ని బంధాల నుండి విముక్తి ప్రసాదించే శ్రీ వేంకటనాధుడు మన దగ్గరే ఉన్నాడు, అతడే మనలను కాపాడేవాడు.

దావతి సుఖము :– దావతి అనగా పీడించునది అని అర్థం కావరించిన కాపురం వల్ల వచ్చే సుఖం పీడింపబడేదే కాని ఆనందాన్ని ఇచ్చేది కాదు. తాత్కాలికంగా తీరిన శరీర కోరికలు మరలా మరలా ఆ సుఖాన్ని అనుభవించడానికి ఇష్టపడతాయి. అలాంటి ధావతి సుఖాల నుండి బయటపడే మార్గం తెలిసి కూడా ఆ తుచ్ఛ సుఖాలను ఎందుకో ఏవగించుకోలేకపోతున్నాం. దానికి ఆకర్షితులవుతున్నాం అని చిన తిరుమలయ్య అటువంటి వారిని ఆలోచించమని చెపుతున్నాడు. ఇటువంటి శారీరక సుఖాల్ని గురించి మనుచరిత్రలో వరూధిని ప్రవరునికి అనేక విధాల చెపుతుంది. ఆ సందర్భంలో పెద్దన ప్రవరుని ద్వారా "ఈ తుచ్ఛ సుఖంబులు మీసాలపై తేనియల్" అని అనిపించాడు. అలాగే చినతిరుమలయ్య పీడించబడే సుఖాలు అనే అర్థం వచ్చేటట్లుగా "కావరించిన కాపురాలు దావతి సుఖాలు" అని పేర్కొన్నాడు.

కర్మపు తొాదసులు :– ప్రాచీన కవల ప్రయోగాలలో తిడుసు శబ్దం కనబడుతూ వుంది. చినతిరుమలయ్య 'తొాడుసు" అని వాదినాడు జైమినీ భారతము ద్వితీయార్వాసము 109 వ పద్యంలో 'తొాడుసు" శబ్దం "బాధ" అనే అర్థాన్ని తెలియజేస్తూ వుంది. దశకుమార చరిత్ర షష్టాశ్వాసం 176వ పద్యంలో 'తొాడుసు" శబ్దం "చిక్కు" అనే అర్థంలో ప్రయోగించబడింది. వేంకటనాధుని పంచతంత్రము నాల్గవ నిశ్వాసం 113వ పద్యంలో తొాడుసు శబ్దం విసుగు అనే అర్థాన్ని సూచిస్తూ ఉంది. రామాభ్యుదయము అష్టమాశ్వాసము 83వ పద్యంలో 'తొాడుసు" శబ్దం సంబంధం అనే అర్థాన్ని కలిగి ఉంది. అయితే చిన తిరుమలయ్య కీర్తనలో ఈ శబ్దం "తొాడుసు" అని కనిపిస్తూ ఉంది. "కర్మపు తొాడుసు" అన్నప్పుడూ జీవి ప్రాణం పోసుకున్న నాటి నుండి ప్రాణం పోయే వరకు గల సంబంధాలు అనే అర్థం గ్రహించవలసి ఉంది.

యీలకరచి :- ప్రాణాలను బిగపట్టుకునుట అని అర్థం. అనేఖ కష్ట నష్టాలు ఒక్కసారిగా వచ్చినా, చలించిపోక బతుకుతున్న వారిని లోకంలో అన్ని బాధల్లో కూడా ఈలకరచుకొని బ్రతికాడు అని అంటారు. అలాగే ఆకలితో బాధపడుతూ ఎవ్వరిని యాచించని వారిని గురించి గూడ "అట్లే ఈలకరచుకొని ఉంటాడు గాని ఎవ్వరినీ దేహి ఆని అడగడు" అని అంటారు. స్థూలంగా బాధలను భరించడం అని పైమాటకు భావన చేయవచ్చు. అన్ని కాలాల్లో కర్మ సంబంధమైన జీవితం యొక్క బాధల్ని భరిస్తున్నామే కాని వాటి నుండి విముక్తి పొందే మార్గాన్ని మాత్రం తెలిసికోలేదు అని అంటున్నాడు తిరుమలయ్య.

వోడు :- "ఓడు" అని ఈ శబ్దం "ఈటమి" అనే అర్థంలో ప్రాచీన కావ్యాలలో కనబడుతుంది. నిఘంటుకారులు కూడా అదే అర్థం చెప్పారు. అయితే చిన తిరుమలయ్య ఈ శబ్దాన్ని లోక వ్యవహారర్థంలో ప్రయోగించినట్లు తెలుస్తుంది. పూర్తిగా పగిలిపోకుండా, నెర్రెలు చీలి, పగిలి పోవడానికి సిద్ధంగా వున్న మట్టి పాత్రలను "ఓడు" పోయింది అంటారు. కొత్త మట్టిపాత్రలను కనుగోలు చేసేటప్పుడు కొనే వ్యక్తులు తమ చూపుడు వేలుని మడచి పతిగెనుపుతో చిన్నగా కొట్టి చూస్తారు. అది సక్రమంగా ఉంటే "టంగు" మనే శబ్దం వస్తుంది. లేకపోతే శబ్దం సరిగా రాదు. అటువంటి దానిని ఓడుపోయిందిగా గుర్తిస్తారు. అట్లే పూర్వం మట్టి పాత్రలలో పంటలు చేసేవారు కూడా తమవద్ద ఉన్న మట్టి పాత్రలను పొయ్యి మీద పెట్టేటప్పుడూ అప్పుడప్పుడు పలుగెనుపుతో కొట్టి చూసేవారు. సంసారాన్ని చక్కగా సరిదిద్దుకోలేని స్త్రీని గురించి రాయలసీయ పల్లె ప్రాంతాలలో "అది వల్లు కాని ఆడది, ఓటికుండను ఒరగ పెట్టి చేస్తుంది" అని నిందించేవారు



ఓటికుండలో వండడం దరిద్రాన్ని సూచిస్తుంది.

ఆడవారు చేతులకు మట్టిగాజులు ఏసుకొనేవారు. ఆ మట్టిగాజుల విషయంలో కూడా 'ఓడు' శబ్దం ఉపయోగించేవారు. ఆ మట్టిగాజులను కూడా బొటనవేలు ఒక ప్రక్క తక్కిన వ్రేళ్ళను ఒక ప్రక్క పెట్టి ఆ గాజును నాజుకూగా తిప్పేవారు. ఓడుపోయిన గాజు శబ్దం తెలిసిపోయేది. ఓడు పోయిన గాజును ధరించడం అనేది అమంగళంగా భావించేవారు.

చినతిరుపతయ్య "ఓడు" అనడానికి బదులు "వోడు" అన్నాడు భద్రత లేని శరీరాన్ని ఈ శబ్దం ద్వారా సూచించాడు. మానవుని శరీరం నుండి గాలి (ఊపిరి) గాలిలో కలసిపోతుంది ఆపైన శరీరం మట్టిలో కలసిపోతుంది. సక్రమంగా లేని మట్టి పాత్రలు, గాజులను ఎట్లయితే "ఓడు" పోయినవి అంటామో అట్లే శ్రీ వెంకటనాధుని స్మరించని వారి జీవితాలు "వోడు" పోయినట్లని చినతిరుమలయ్య భావించాడు.

వుంగిటి :– ఈ శబ్దానికి నిఘంటువులు "నాము" అనే అర్థాన్ని ఇచ్చాయి. ఇది ఒక రకమైన పశురోగం. లేత ఆముదపు ఆకులు గాని లేక అపడపుడే కంకి వేయడానికి సిద్ధంగా వున్న జొన్న ఆకులు గాని తింటే పశువులకు నాము ఎక్కుతుంది. నాము ఎక్కడం అంటే ఒక విధంగా విషాహారం తినడం వల్ల వచ్చే రోగం. నాము ఎక్కిన పశువులకు దానికి విరుగుడు ఆహారాన్ని తినిపిస్తే పశువులు బ్రతికే అవకాశం వుంది. ఒకప్పుడు పల్లెలలో నాము ఎక్కిన పశూవులకు మంత్రం కూడా వేసేవారు. పాముకాటుకు, పశువుల నాముకు మంత్రించే మంత్రగాండ్లు పూర్వం పల్లెలలో విరివిగా ఉండేవారు.

వుంగిటి బతుకులు :– నాము ఎక్కిన పశువు తల తిరిగి గిరగిర తిరుగుతూ కొంతకాలానికి మరణిస్తుంది. ఆ పశువు తిరగడాన్ని బట్టే దానికి నాము ఎక్కిందని గ్రహించే వారు రాయలసీమ పలెల్లో ఊరికే అటూ ఇటూ తిరిగే పిల్లల్ని లేదా పనిపాట లేకుండా తిరిగే వ్యక్తిని ఉద్దేశించి "నామెక్కిన గొడ్డు తిరిగినట్లు తిరుగుతున్నాడు" అని అనడం ఉంది. ఇక్కడ చిన తిరుమలయ్య వాడిన ఈ "వుంగిట బతుకులు" ప్రయోగానికి వ్యర్థమైన బ్రతుకులు అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

యీాదిగిల బడు :- ఏదో ఒకానొక భయంతో మొండికెత్తడం, కదలిరాకపోవడం అనే అర్థాలున్నాయి. ఉపాధ్యాయుడంటే భయపడే పిల్లవాడిని పాఠశాలకు తీసుకొని పోవడానికి తల్లితండ్రులో లేక గురువు పంపిన ఒకరిద్దరు పెద్ద పిల్లలో బలవంతంగా లాగికొనిపోయే ప్రయత్నం చేసినా ఆ పిల్లవాడు కదిలి రాకుండా మొరాయించడం, వాళ్ళు ఆ పిల్లవాడిని రెక్కలు పట్టుకొని లాక్కొని వెళుతున్నా బోర్లపడి మొండికేయడాన్ని అదిగిలపడి ఏడ్చారు అంటారు. అలాగే పశువుల విషయంలో కూడా ఉంది. కొన్ని పశువులు ఏదో కారణం చేత ఒక్కొక్క స్థలానికి పోవడానికి భయపడతాయి. ముఖ్యంగా బండిలాగే ఎద్దులు అధిక బరువు గల బండీని మంచి ఎత్తయిన ప్రదేశానికి లాగుకొని పోతాయి. కాని కొన్ని ప్రదేశాలకు తేలికైన బండిని గూడ లాగుకొని పోకుండా నిలిచిపోతాయి. అప్పుడు ఆ పశువును ఉద్దేశించి "ఆ చోటికి పోయేకుందికి ఈతిగల బడి చస్తుంది గాని అడుగు ముందుకు వేయదు" అని అంటారు.

"వోడు పోయినట్టి వుంగిటి బతుకుల ఈడుగలబడడం" అంటే – ఈ జీవితం శాశ్వతమైంది కాదు. ఇపుడో, ఇంక గొంత గట్టిదని నమ్మి వ్యర్థమైన బ్రతులు బ్రతుకుతూ ఇక్కడే శాశ్వతంగా ఉండాలని మొండికేస్తుంటారు మానవులు. అలా కాకుండా ఇది అశాశ్వతమని నమ్మి శ్రీ వేంకట నాథుని సేవిస్తే అతడే కాపాడతాడనే భావాన్ని చిదంబరమలయ్య తెలియజేశాడు.

> అంతటికి ఏలికైన ఆదినారాయణు తన
> అంతరంగాన నిలిపే అన్నమయ్య
> సంతసాన చెలువొందె సనకసనందనాదు
> లంతటివాడు తాళ్ళపాక అన్నమయ్య!!
>
> బిరుదు టెక్కెములుగా పెక్కు సంకీర్తనములు
> హరిమీద విన్నవించె అన్నమయ్య
> విరివిగలిగినట్టి వేదముల అర్థమెల్ల
> అరసి తెలిపినాడు అన్నమయ్య!!
>
> – చినతిరుమలయ్య

# తెలుగు పద్యామృతం



డాక్టర్ N.Ch. చక్రవర్తి
✆ 93910 39119

పాండవుల దూతగా శ్రీకృష్ణుడు దుర్యోధనుని సభకు వెళ్ళాడు. తన ధర్మాన్ని నిర్వర్తించడం లో భాగంగా దుర్యోధనునికి హితం చెప్పాడు. పోగాలం దాపురించిన వాడికి హితాలూ ప్రియాలూ ఎక్కువు. ఇది కృష్ణునకు కూడా తెలుసు. కానీ కాగలది దుర్యోధనుని చేతనే చేయించాలి. ప్రపంచానికి దుర్యోధనుని దుష్టబుద్ధి తెలియచేయాలి. అందుకే దౌత్యం నెరపడం. కౌరవుల వద్దకు రాయబారం పంపుతూ ధర్మరాజు కృష్ణునకు కొన్ని మాటలు చెప్పాడు. ఆ సందర్భంలో తిక్కన(1) రచించిన పద్యం ప్రపంచ శాంతికి దోహదం చేసేది.

చంపకమాల

పగయడగించుటెంతయు శుభంబదిలెస్స,యడంగునే పగం
బగ? పగగొన్న మార్కొనక పల్కక యుండగవచ్చునే? కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగఁదీర్చగ వచ్చినఁ గ్రౌర్యమొందు, నే
మిగతిఁ దలంచినంబగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా!

కేశవుడు అంటే కృష్ణుడు. పగయడ గించుటెంతయు శుభంబది లెస్స అంటే పగను అణచుకోడం శుభదాయకం. అదే లెస్స అయింది.

అడంగునే పగన్ పగ అంటే పగతో పగ నివారణ అవుతుందా?? కాదు. పగగొన్న మార్కొనక పల్కక యుండగవచ్చునే అంటే అవతలి వారి పగ ఇవతలి వారిని ఊరకే ఉంచుతుందా?? కడున్ మొదలెత్తిపోవఁబగ దీర్పగవచ్చినఁ గ్రౌర్యమొందు అంటే పగను తీర్చుకోడానికి పూనుకుంటే ఎంతో హింస చేయాల్సి వస్తుంది.

ఏమిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు అంటే ఏ రకంగా చూసినా పగను అణచడమే శ్రేయస్కరం.

మిక్కిలి అశాంతిమయమైన ప్రపంచరాజ్యాలకు ఈ హితవు పనిచేస్తే ఎంత హాయి!!ఎంతటి విశ్వశ్రేయం!! కనుక ధర్మరాజుని పై మాటలు సర్వకాల సర్వసమాజాలకు పనికివచ్చే నీతి. భారత నీతి. ప్రాచీనకాలంనుండి మనది అదే సంస్కృతి. ఆ శాంతి సంస్కృతిని తిక్కన సందర్భవశంగా చెప్పాడు.

ఆధునిక కవుల్లో అగ్రశ్రేణిలోని కవి కవికోకిల దువ్వూరి రామిరెడ్డి గారు. వీరు చాలా రచనలు చేసారు. పానశాల,కృషీవలుడు కావ్యాలు ప్రసిద్ధమైనవి. బహుభాషా కోవిదులు. వారు కృషీవలుడు కావ్యంలోని ఒక పద్యం చూద్దాం.(2)

మత్తేభం.

ఫలముల్ మెక్కెడివారు తత్ఫలరసాస్వాదక్రియాలోలురై
పలుమారమ్మధురత్వమున్నుతుల సంభావింతురే కాని, తత్
ఫల హేతుక్రమ వృక్షముందలపరెవ్వారైన నట్లే రమా
కలితుల్ బోనములన్ భుజించుచు నినున్గన్నెత్తియుంజూతురే

అని రైతు స్థితిని స్మరిస్తారు. ఫలముల్ మెక్కెడివారు అంటే పండ్లు తినేవారు – తత్ఫల రసాస్వాద క్రియాలోలురై అంటే ఆ పండ్ల రసాలను ఆస్వాదించడం లో నిమగ్నులై – పలుమారమ్మధురత్వమున్నుతుల సంభావింతురే కాని, అంటే పలుమార్లు ఆ రసాల గొప్పదనాన్ని చెప్పుకుంటూ ఉంటారు కానీ – తత్ఫల హేతుక్రమ వృక్షముం దలపరెవ్వారైన అంటే ఆ ఫలాలకు కారణ భూతం అయిన చెట్టును స్మరించుకోరు.

ఆ ఆవిధంగానే, రమాకలితుల్ బోనములన్ భుజించుచున్ అంటే ధనికులు నువ్వు పండించిన బువ్వ తింటూకూడా –

నినున్ గన్నెత్తియున్ జూతురే అంటేనిన్ను కనీసం కన్నెత్తి కూడా చూడరు అని.

ఇక్కడ రైతును చెట్టుతో పోల్చడం రైతు చెట్టు అంత ఉదాత్తుడు అని చెప్పడం. అంతేకాక త్యాగగుణం లో కూడా పోలిక. రమా కలితుల్ అనడంలో ఒక ధ్వని. వారి సంపదకు రైతే మూలం అనీ సంపదలను తినబోరనీ. ఈ పద్యం హృద్యమైనది.

పోతన కృష్ణభక్తి అనన్యం. తన కృష్ణ శతకంలో ఇలా విన్నవించుకున్నాడు కృష్ణునితో:(3)

కం.

**అంగన పనుపున ద్రోవతి**
**కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిన యా**
**సంగతివిని దయ నొసగితి**
**రంగుగ సంపదలు లోకరక్షక! కృష్ణా!**

అంగన పనుపునన్ తనభార్య చెప్పగా, ద్రోవతి కొంగున, తన పంచె కొంగున అటుకులను ముడుచుకుని వచ్చిన, అటుకులను కట్టుకుని వచ్చిన సంగతివిని, విషయం తెలుసుకుని రంగుగ సంపదలను దయన్ ఒసగితివి, గొప్ప సంపదలను దయతో అతడికి ఇచ్చావు కదా కృష్ణయ్యా! అంటాడు.

ఈ కుచేల కథ ప్రసిద్ధం అయినది. భగవంతుని కృపకు పేద ధనిక తారతమ్యం లేదని చెప్పడం. ఆయన అన్నన్ని సిరులు ఇవ్వాలని ఎన్నెన్నో లంచాలు ఇచ్చేస్తే కాదు. సమర్పించే హృదయం, ఆర్తి, సర్వసమర్పణలు మాత్రమే పరిగణన. ఇదే భారతీయ భక్తి స్ఫూర్తి.దాన్ని ఈ శతక పద్యం లో పోతన చెప్పాడు..

గురుసహస్రావధాని డా. కడిమెళ్ల వరప్రసాద్ గారు నరసాపురం వాస్తవ్యులు. అవధానిగా సుప్రసిద్ధులు. ఆయన రచనల్లో తప్పుకాదు శతకం ఒకటి(4). అందులో ఒక పద్యం.

తేగీ.

**చలన చిత్రమ్ములన్మనశ్చలన మెసగు**
**కొంటె దృశ్యములిపుడు కోకొల్ల లాయె**
**కనుచు సంతోష పడుట ప్రేక్షకునితప్పు**
**దర్శకుండట్లు తీయుట తప్పుకాదు!**

ప్రేక్షకులు చూస్తున్నారు కనుక తీస్తున్నామని నిర్మాతా, దర్శకులూ; వాళ్ళు తీస్తున్నారు కనుక తాము చూస్తున్నామనీ ప్రేక్షకులు ఒకరిపై ఒకరు సౌకర్యంగా త్రోసేసుకోవడం మనం చూస్తున్నదే. ఇక్కడ మన కవి నిస్సంశయంగా చెప్పారు ఈ పద్యంలో సినిమా చూసేవాళ్ళదే తప్పని.

**చలన చిత్రమ్ములన్మనశ్చలన మెసగు**
**సినిమాల్లో మనస్సు చాంచల్యం పెంచేటట్టుగా ,**
**కొంటె దృశ్యము లిపుడు కోకొల్ల లాయె**
**చిలిపి దృశ్యాలు ఇప్పుడు కోకొల్లలు .**
**కనుచు సంతోషపడుట ప్రేక్షకుని తప్పు**
**అటువంటివి చూస్తూ ఆనందించడం ప్రేక్షకుల తప్పే.**
**దర్శకుండట్లు తీయుట తప్పుకాదు.**

అలా తీయడం దర్శకుల తప్పు కాదు. అన్నారు.

తీసేవాడు తీస్తే చూసేవాడికి బుద్ధి ఉండద్దూ!! ఇదీ కవి అభిప్రాయం. ఇలాంటివి ఎన్నో ఉన్నాయి ఈ శతకం లో.

సూచికలు:

1. తిక్కన భారతం ఉద్యోగపర్వం తృతీయాశ్వాసం.

2. కవికోకిల దువ్వూరి రామిరెడ్డి గారి కృషీవలుడు కావ్యం.

3. పోతన శ్రీకృష్ణశతకం ప్రచురణ: తి తి దేవస్థానం.తిరుపతి (2014.)

4.తప్పుకాదు డా. కడిమెళ్ళ వరప్రసాద్ గారు. తురగా ప్రచురణాలయం. నరసాపురం. (2022.)92478 79606.

> నిండార రాజ నిద్రించు నిద్రయునొకటే
> అండనే బంటు నిద్ర ఆదియూనొకటే
> మెండైన బ్రహ్మణుడు మెట్టుభూమి యొకటే
> మెండైన బ్రహ్మణుడు మెట్టుభూమి యొకటే
> ఛండాలు డుండేటి సరి భూమి యొకటే

# వ్యావహారిక భాషోద్యమంలో గురజాడ



డాక్టర్ చెంగల్వ రామలక్ష్మి
✆ 63027 38678

వ్యావహారిక భాషోద్యమం పుట్టి 110 ఏళ్లకి పైన అవుతోంది. ఇప్పుడు కథలు, నాటకాలు, నవలలు, సాహిత్య విమర్శ, వ్యాసాలు అన్నీ జీవద్భాషలోనే వస్తున్నాయి. ఇప్పుడు వాడుక భాష ను గ్రామ్యమని ఎవ్వరూ నిందించరు. ఈ భాషారూపం ఉదాత్త భావ ప్రకటనకు సాధనం కాదని ఎవ్వరూ భావించరు. వివిధ పత్రికలు జీవద్భాష వాడకం వల్ల పాఠకులకు చేరువయ్యాయి. ప్రసార మాధ్యమాలు వాడుక భాషకు విశేష ప్రాచుర్యాన్నిచ్చాయి, ఇస్తున్నాయి. సాంకేతిక విప్లవం వల్ల ఇంటర్నెట్ ఆధారిత వెబ్ మ్యాగజైన్లు తెలుగులో అసంఖ్యాకంగా వెలువడుతున్నాయి. వీటన్నిటా జీవద్భాష తన పరిమళాలను వెద జల్లుతోంది.



120 ఏళ్ల కిందట పరిస్థితి వేరుగా ఉండేది. సాహిత్యం అంటే పద్య కవిత్వమే! భాషంటే ప్రాచీన కావ్య భాషే! వచనమంటే కఠిన పదజాలంతో ఉండే గ్రాంధికమే! విద్యార్థుల పాఠ్య గ్రంథాలు, వారు పరీక్షలలో రాసే సమాధాన పత్రాలు గ్రాంధికంలోనే ఉండాలన్న నియమం. ఆధునిక అవసరాలకు ఈ భాష సరిపోదని గుర్తించిన గిడుగు, గురజాడలు విద్యారంగంలో వ్యావహారిక భాష అమలుకు పెద్ద

ఉద్యమమే చేయవలసి వచ్చింది. కఠినమైన గ్రాంధిక శృంఖలాల నుంచి భాషకు స్వేచ్ఛ కలిగి, ఎలా మాట్లాడుతున్నామో అలాగే రాసే ఈ అవకాశం ఒక్క రోజులోనో, ఒక్క నెలలోనో వచ్చింది కాదు. దీని వెనక ఎంతో కృషి పట్టుదల, నిబద్ధత ఉన్నాయి వ్యావహారిక భాషోద్యమం ఒక చారిత్రక ఉద్యమం.

భాషోద్యమం ప్రధానంగా విద్యారంగానికి సంబంధించినది. 1910లో ఇది ప్రారంభమైంది. అయితే, అంతకు పూర్వమే వ్యావహారిక భాష లో రచనలు చేయాలనే భావన రచయితలలో కలిగింది

భాషోద్యమం ప్రధానంగా విద్యారంగానికి సంబంధించినది. 1910లో ఇది ప్రారంభమైంది. అయితే, అంతకు పూర్వమే వ్యావహారిక భాష లో రచనలు చేయాలనే భావన రచయితలలో కలిగింది. జీవద్భాష గొప్పదనాన్ని తెలియజేసే ముందు మాటతో గురజాడ కన్యాశుల్కాన్ని రచించారు. విద్యారంగంలో పాఠ్య పుస్తకాలు, పరీక్షా విధానం, వ్యాస రచన మొదలైనవన్నీ కూడా వ్యవహారికం లోనే జరగాలనే అభిప్రాయం విద్యాశాఖాదికారులలో 1910లోనే కలిగింది. అందుకు కారణం కూడా ఉంది. బొంబాయి, కలకత్తా, మద్రాసు యూనివర్సిటీలు సాధించిన విద్యాభివృద్ధి, విద్యా ప్రమాణాలను గురించి 1905లో విద్యావేత్తలు సమర్పించిన నివేదికను బట్టి ఇంగ్లీషు వారు ప్రవేశపెట్టిన ఆధునిక విద్యావిధానంలో ప్రాధమిక తరగతుల నుంచి పట్టభద్రు లయ్యేవరకు విద్యార్థులు అన్ని విషయాలను ఇంగ్లీషు బోధనలోనే నేర్చుకుని ఉండటం వల్ల ఆ భాషలోనే ప్రావీణ్యం పొందారు. తాము నేర్చుకున్న విద్యలను ఇంగ్లీషులో బోధించ గలుగుతున్నారు కాని మాతృ భాష లో బోధించ గల నైపుణ్యం వారికి రాలేదని ఆ నివేదిక తెలిపింది. (ఇప్పటికీ ఇదే పరిస్థితి కొనసాగుతు ఉండటం శోచనీయం). అంతేగాక, దేశ భాషలలో ఆధునిక విజ్ఞానం బోధించ లేకపోవటానికి, ఆ

భావాలను వ్యక్తం చేయటానికి తగిన పదజాలం లేకపోవటం కూడా కారణం. ఆధునిక భావాలను, శాస్త్ర విజ్ఞానాన్ని దేశ భాషలలో వివరించగల సామర్థ్యం విద్యావంతులలో పెంపొందించటానికి విద్యలోవ్యాసరచన,అనువాదంపాఠ్యంశా లయ్యాయి. వీటిలో అనుసరించవలసిన రచనా శైలి విషయం లో జరిగిన చర్చలు గ్రాంధిక, వ్యవహారిక భాషోద్యమానికి దారి తీసాయి.1910లోనే మెట్రిక్యులేషన్ స్థానంలో స్కూల్ ఫైనల్, ఎఫ్. ఏ. స్థానంలో రెండేళ్ల ఇంటర్మీడియట్ విధానం అమలులోకి వచ్చింది. ఈ కొత్త విధానానికి అవసరమైన పాఠ్య ప్రణాళిక రూపొందించటానికి మద్రాసు యూనివర్సిటీ ఒక కమిటీని నియమించి, ఉపాధ్యాయులకు కొన్ని సూచనలిచ్చింది. ఇంతకు కొంచెం ముందు,1906లో గంజాం, విశాఖపట్నం, గోదావరి జిల్లాలవిద్యా పరీక్షాధికారిగా ఉన్న ఏట్స్ దొర తెలుగులో గ్రంథ భాష కు, వాడుక భాషకు ఉన్న పెద్ద అంతరాన్ని గుర్తించి, పి. టి. శ్రీనివాసయ్యంగారు, గిడుగు, గురజాడ లతో చర్చించారు. విద్యారంగంలో వాడుక భాషను గురించి ఆలోచనకు ఈ చర్చ దోహదపడింది.

వ్యావహారిక భాషోద్యమంలో గురజాడ కృషి ప్రధానంగా మద్రాసు యూనివర్సిటీ లో ఇంటర్మీడియట్ కాంపొజిషన్ కమిటీలో సభ్యుడిగా, వ్యాస రచన కు అర్హమైన భాష ను నిర్ణయించటంలో, పాఠ్యపుస్తకాల నిర్ణయం లో కనిపిస్తుంది. విద్యాశాఖ సూచించిన నిబంధనలను దృష్టిలో పెట్టుకుని గురజాడ కొన్ని పాఠ్యపుస్తకాలను సూచించారు. విద్యార్థుల భాషాభివృద్ధికి వేసే పాఠ్య పుస్తకాలు మంచి సాహిత్యం కలిగినవై ఉండాలని, విద్యార్థులు సాహిత్యాన్ని విమర్శనాత్మక దృష్టితో అధ్యయనం

> “వ్యావహారిక భాషోద్యమంలో గురజాడ కృషి ప్రధానంగా మద్రాసు యూనివర్సిటీ లో ఇంటర్మీడియట్ కాంపొజిషన్ కమిటీలో సభ్యుడిగా, వ్యాస రచన కు అర్హమైన భాష ను నిర్ణయించటంలో, పాఠ్యపుస్తకాల నిర్ణయం లో కనిపిస్తుంది.”

చేయాలని గురజాడ చెప్పారు. కమిటీలో ఇతర సభ్యులు సూచించిన పాఠ్యపుస్తకాలను గురజాడ సహేతుకంగా విమర్శించారు. విద్యార్థులు ప్రాచీన, ఆధునిక శైలులను తెలుసుకునేందుకు వీలుగా పుస్తకాలను సూచించారు. ప్రాచీనసాహిత్యంలోని గ్రంధాలను పాఠ్య పుస్తకాలు గా నిర్ణయించ్చేటప్పుడు వాటిలో శృంగార పద్యాలు ఉండకూడదని, ఆ గ్రంధాలే పెట్టవలసి వస్తే, ఆ పద్యాలు లేకుండా వేరే భాగాలు పెట్టవచ్చని సూచించారు. ఎందుకంటే ఇవి విద్యార్థులపై చెడు ప్రభావాన్ని చూపించవచ్చు. తెలుగు భాషాధ్యయనంలో అభివృద్ధి సుతారాం కనిపించట్లేదని గురజాడ వ్యధ చెందారు. ప్రజలందరిని విద్యావంతులను చేయటమన్నది మాతృభాషల అభివృద్ధి మీద, ఉత్పన్నమౌతున్న సారస్వతం మీద ఆధారపడివుంటుంది. మాతృ భాషలను బోధించే వారి భుజస్కంధాలపై మహత్తర బాధ్యత ఉందని వారు చెప్పారు. విద్యారంగంలో మాతృభాషా ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పిన విషయాలివి. ఇవి నేటి విద్యారంగానికి బాగా వర్తిస్తాయి. "విద్యా విధానమే దుష్టము, లోపభూయిష్టము, అభిరుచి అన్నదే కలిగించటం లేదు. దీనికి నాయకత్వం వహించు వ్యక్తులు లేకపోవటం, దీనికి తోడు ఇంగ్లీషు తో పోటీ" ఇది సమకాలీన విద్యావిధానం పై గురజాడ విమర్శ!

> నాటి విద్యావిధానాన్ని, విద్యారంగాన్ని ఎంతో లోతుగా పరిశీలించి గురజాడ వ్యక్తం చేసిన అభిప్రాయాలు కొన్ని నాటికే కాదు నేటికీ వర్తిస్తాయి.

నాటి విద్యావిధానాన్ని, విద్యారంగాన్ని ఎంతో లోతుగా పరిశీలించి గురజాడ వ్యక్తం చేసిన అభిప్రాయాలు కొన్ని నాటికే కాదు నేటికీ వర్తిస్తాయి. విద్యార్థులు వ్యాకరణ సూత్రాలను కంఠతా పట్టటం వల్ల వాళ్లకు వ్యాకరణ జ్ఞానం రాదు. భాషాపరిశీలన వల్ల వ్యాకరణ జ్ఞానం వస్తుంది. అందుకోసం దోషాలు లేని పాఠ్య పుస్తకాలు విద్యార్థులు చదవాలని చెప్పారు. ఇప్పటికి వ్యాకరణం చెప్పటమంటే సూత్రాలు కంఠస్థం చేయించటమనే అర్థంలోనే బోధన

సాగుతోంది. ఇది సరి అయిన పద్ధతి కాదని గురజాడ నాడే చెప్పారు.విద్యా విధానంలో కొత్త గా ప్రవేశపెట్టిన అనువాదం, వ్యాస రచనలను గ్రాంధికంలోగాని, వ్యావహారికంలో గాని రాయటానికి విద్యాశాఖ వారు స్వేచ్ఛ కలిగించారు. వీటికి సంబంధించిన పుస్తకాల విషయం లో గ్రాంధిక వాదులకు, వ్యావహారిక వాదులకు ఏకీభావం కుదరలేదు. అప్పుడు మద్రాసు యూనివర్సిటీ ఈ వివాదాన్ని పరిష్కరించేందుకు 1911లో ఒక సలహా సంఘాన్ని నియమించింది. ఈ సంఘం అనేకసార్లు సమావేశమై శిష్ట వ్యావహారికానికి అనుకూలంగా తీర్మానం ఇచ్చింది. కానీ ఈ తీర్మానం తాత్కాలికమే అయింది.

విద్యారంగంలో గ్రాంధిక, వ్యావహారిక వాదుల మధ్య బయలుదేరిన విభేదాలు దేశ వ్యాప్తంగా ఉద్యమరూపం గా పరిణమించాయి.1911లో ఆంధ్ర సాహిత్యపరిషత్ స్థాపన జరిగింది. దీనిలో ప్రధానంగా కృషి చేసినవారు జయంతి రామయ్య పంతులు గారు. ఆంధ్ర దేశం లో గ్రాంధిక భాషాభిమానులు సభలు, సమావేశాలు జరిపితమ వాదానికి అనుకూలంగా తీర్మానాలు చేసి యూనివర్సిటీ అధికారులకు, ప్రభుత్వానికి పంపారు. పత్రికలలో గ్రాంధిక, వ్యావహారిక వాదులకు వాదోపవాదాలు జరిగాయి.1913లో జయంతి రామయ్య పంతులు నన్నయ్య కాలం నుండి వస్తున్న కావ్య భాషను సమర్థిస్తూ కావ్య భాషా సమర్ధనం అనే కరపత్రాన్ని ప్రచురించారు. గిడుగు రామమూర్తి ఆధునిక తెలుగును సమర్ధిస్తూ 'మెమోరాండం ఆన్ మోడరన్' తెలుగు అనే కరపత్రాన్ని ప్రచురించారు. ఆనాటి హిందూ, కృష్ణా వంటి పత్రికలు భాషోద్యమానికి సంబంధించిన చర్చలకు వేదిక లయ్యాయి.

వ్యాస రచనలో ఉపయోగించవలసిన పద పట్టికలకు సంబంధించి ఉప సంఘం సభ్యులతో విభేదించిన గురజాడ తన అసమ్మతిని తెలియజేస్తూ, తన వాదాన్ని సమర్థిస్తూ డిసెంట్ పత్రాన్ని సమర్పించారు. కాని, సంఖ్యాధిక్యత వల్ల, రాజకీయపలుకుబడి వల్ల అప్పటికి గ్రాంధిక వాదుల వాదమే నెగ్గింది. డిసెంట్ పత్రం ఒక పరిశోధన గ్రంధం. ప్రాచీన కథలలో, న్యాయ స్థానాలలోని పత్రాలలో, పూర్వులు రాసుకున్న ఉత్తరాలలో వాడుక రూపాలు సజీవంగా ఉన్నాయని నిరూపిస్తూ గురజాడ అనేక ఉదాహరణలు ఇందులో ఇచ్చారు. అవసరమైన సందర్భాలలో కమిటీ సభ్యుల లోని లోపాలను ఎత్తి చూపారు. మాండలిక

భాషలు, వ్యాకరణాలు, నిఘంటువులు, ప్రమాణ భాష మొదలైన విషయాల పై సహేతుకమైన అభిప్రాయాలతో, శాస్త్రీయ పద్ధతులతో రూపొందించిన గ్రంథం డిసెంట్ పత్రం. గ్రాంధిక, వ్యవహారిక భాషో ద్యమంలో లభించిన అపురూపమైన ఆణిముత్యం ఇది.

మొదట గ్రాంధిక భాషా వాదుల ప్రాబల్యం వల్ల వ్యావహారిక భాష కు కొంత అవరోధం ఏర్పడినా, తరవాత వాడుక భాషకే విజయం లభించింది క్రమంగా విద్యారంగంలో పరీక్షా విధానంలో, సృజనాత్మక రచనలలో శిష్ట వ్యావహారిక భాషకు ప్రాధాన్యత కలిగింది. పరిశోధనా పత్రాలు వ్యవహారికం లోనే రాయటానికి అనుమతి లభించింది. ఇదంతా నాటి వ్యావహారిక భాషా వాదులలో ప్రముఖులైన గిడుగు, గురజాడ ల ఆమేయకృషి ఫలితమే!

దేశ వ్యాప్తంగా పట్టణాలలో, పల్లెల్లో జరిగిన సభలలో వాడుక భాష గొప్పదనాన్ని తెలియజేస్తూగిడుగు రామమూర్తి వ్యావహారిక వాదానికి నాయకత్వం వహిస్తే, విద్యారంగంలో వాడుక భాష కోసం కృషి చేస్తూ, తన రచనల ద్వారా జీవద్భాషకు ప్రాచుర్యం తెచ్చినవారు గురజాడ.

ఆ మహానుభావుల అవిశ్రాంత కృషి వల్ల నేడు జీవద్భాష లో చక్కగా రాయగలుగు తున్నాం. చదవగలుగుతున్నాం. ఎటువంటి క్లిష్ట తరమైన భావాలనైనా చెప్పటానికి అనువైనది జీవద్భాష. కాని, నేటి విద్యార్థులకు, యువతకు ఇంత చక్కగా మాట్లాడుకునే భాషలో కూడా రాత నైపుణ్యం కొరవడుతోంది. భావ వ్యక్తీకరణ సామర్థ్యం మృగ్యమైపోతోంది. పఠన కళ అపురూపమైపోతోంది. గురజాడ ఉత్తమ అధ్యాపకులు, విద్యావేత్త. బోధన కళ గురించి, ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఉండవలసిన విలువలగురించి ఎన్నో మంచి మాటలు చెప్పారు. వాటిని ఆదర్శం గా తీసుకుంటూ, విద్యారంగంలో ఏ జీవద్భాష అమలు కోసం గిడుగు, గురజాడలు తమ జీవితాలను అంకితం చేసారో, ఆ భాషలో విద్యార్థులలో రచనా నైపుణ్యాలను, భావ వ్యక్తీకరణ నైపుణ్యాలను, పఠనాసక్తి ని పెంపొందించ వలసిన బాధ్యత ఉపాధ్యాయులు, అధ్యాపకుల పై ఉంది. అదే గిడుగు గురజాడ లకు మనం చూపించే కృతజ్ఞత.

# ధన్యవాదాలు

ప్రకాశిక రెండవ వార్షికోత్సవ సంచికతో కలిపి, ఇప్పటివరకు వచ్చిన 10 సంచికలలో వ్యాసాలు, కథలు, కవితలు ప్రచురించిన వారందరికీ పేరు పేరునా హృదయపూర్వక ధన్యవాదాలు. ప్రకాశిక సంచికలు చదివి, అభినందించి, అమూల్యమైన సలహాలు, సూచనలు ఇచ్చిన పాఠకులకి అక్షర నీరాజనాలు. భవిష్యత్తులో కూడా ప్రకాశికని ఆదరించి మీ బంధు మిత్రులకి కూడా పరిచయం చేయమని కోరుతున్నాము.

ధన్యవాదాలు

ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ M.Sc., M.Phil., Ph.D.
ప్రధాన సంపాదకులు, ప్రకాశిక
editor@prakasika.org








## Sir Chandrasekhara Venkata Raman FRS

*(7 November 1888 – 21 November 1970)*

was an Indian physicist. Raman received the 1930 Nobel Prize in Physics and was the first Asian to receive a Nobel Prize in any branch of science.

" *Desamante Mattikadoi*
*Desamante Manushuloi* "

*A Country is not made of land;*
*a country is made of it's people-1910*

*~ Mahakavi Gurajada Apparao*





*Gurajada Appa Rao's House*